

Twenty Five Years ago, with great imaginations, you started this work for helping our women-folk. It is my hope and desire that its activities will expand and that assistance will be rendered to a larger number of people hereafter.

—*S. Radhakrishnan.*



# ఆంధ్ర మహిళ

సంపుటి 20 ఫిబ్రవరి 64 సంచిక 2

## విషయసూచిక

ముఖచిత్రం

సరోజినీ నాయుడు


జనవరి 1 ... 2

సంపాదకీయం ... 3

ప్రాచీన నగరములు (తక్షశిల) ... 5
శ్రీమతి వారణాసి యశోదాదేవి

వొడ్డుకుజేరిన వొంటరి కెరటం (కధానిక) ... 9
శ్రీమతి శివరాజు సుబ్బులక్ష్మి

రిపబ్లిక్ దినోత్సవం .... 1

వీడ్కోలు ... 16

అరకు వాలీ ... 17
శ్రీమతి కె. సుగుణమణి

డైరీ (కధానిక) ... 21
శ్రీమతి గుళ్ళపల్లి సుందరమ్మ

కవితా తిలక సరోజినీ దేవి ... 26
శ్రీ శివరాం

కొత్తశకం (కవిత) ... 27
సత్యం

శారద లేఖలు ... 29
శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ



ఆంధ్ర మహిళ

7 ఎ, రోజరీ చర్చిరోడ్, శాంథోమ్ మద్రాసు-4




వ్యవస్థాపకురాలు : దుర్గాబాయి దేశ్‌ముఖ్

సంపుటి 20 ఫిబ్రవరి 1964 సంచిక 2

# నేటి విద్య

స్త్రీ పురుష సమానత్వాన్ని అన్ని రంగాలలోనూ ఆఖరికి, గగనవిహారంలో కూడా ఆమోదించిన యీ కాలంలోకూడా మన దేశంలో, స్త్రీ విద్య గురించి ఇంకా భిన్నాభిప్రాయాలు వినబడుతున్నాయి. విద్యలో, వృత్తిలో, సాంకేతిక పరిజ్ఞానంలో స్త్రీలు పురుషులతో కొన్ని రంగాలలో సరితూగలేరను అభిప్రాయాలు కొందరు వ్యక్తీకరిస్తున్నారు.

స్త్రీల ఉన్నత విద్య అంటే గృహ నిర్వహణా, లలితకళలూ, సాహిత్యమూ వీటికి సంబంధించినదే అవాలి. ఆనాడే ఆమె వున్నత విద్య నిత్య జీవితానికి సన్నిహితంగా వుంటుంది అని కొందరి అభిప్రాయం. ఈ అభిప్రాయానికి పూర్తిగా వ్యతిరేకులయిన కొందరు రసాయిన, సాంకేతిక శాస్త్రాలలో స్త్రీకి విద్యాశిక్షణ గరపడం ఎంతైనా అవసరం అంటున్నారు. ఈ రెండు అభిప్రాయాలు రెండు ధృవాలవలె ఎక్కడా కలుసుకోవు - కలుసుకోలేవు.

అసలు విద్య అనుదానికి స్త్రీ పురుష విభేదము ఎందుకు వుండాలి, అన్న ప్రశ్న వస్తుంది. మేధను ఆశ్రయించి అబ్బునది విద్య. ఈ విద్య జీవనోపాధికీ, గృహ నిర్వహణకీ స్త్రీ పురుషులు నేర్చుకుంటున్నారు అన్న దృక్పథం విద్య యొక్క విలువని తగ్గించి వేస్తోంది. విజ్ఞానాన్ని, వివేకాన్ని, వినయాన్ని విస్తృత పరిచేదే విద్య. ఆనాడే ఆ విద్యకి సార్థకత ఏర్పడుతుంది. ఈ సద్గుణాలు స్త్రీ పురుషు లిద్దరికీ కావలసినవే.

పురుషుడు కాబట్టి కుటుంబ పోషణకి యీ మాదిరి విద్య నేర్చుకోవాలి. స్త్రీ కాబట్టి గృహ నిర్వహణకి ఆ మాదిరి విద్య నేర్చుకోవాలి అన్నది సంకుచితమైన దృక్పథం. వ్యక్తి అభిరుచినిబట్టి, అభిలాషని పట్టి, ఫలానా విద్య అని ఎన్నిక చేసుకోవాలేగాని - యిందులో స్త్రీ పురుష విభేదానికి చోటులేదు.

— మాలతీ చందూర్

గౌరవ సంపాదకులు

# జనవరి 1

జనవరి ఒకటవ తేదీన సాంగ్లీ రాజదంపతుల వీడ్కోలు సమావేశము లజ్ చర్చిలోని మా సభా ప్రాంగణంలో జరిగినది. డిశంబరులో జరిగిన టూరిస్ట్ హాస్టల్ భవన ప్రారంభోత్సవానికి విచ్చేసిన - సాంగ్లీరాజ దంపతులు దక్షిణ దేశ యాత్రలు ముగించుకుని — జనవరి ఒకటవ తేదీ నాటికి మద్రాసు చేరుకున్నారు. నూతన వర్షారంభపు తొలిరోజున రాజదంపతులు మా సభ కార్యకర్తలతో, సభ్యులతో కలిసి కొంత సమయం గడుపుట మాకూ వారికిగూడా ఒక మరుపురాని అనుభూతి అయినది.

జనవరి ఒకటవ తేదీన వీడ్కోలు సమావేశ సందర్భాన 5-30 గం॥లకు రాజదంపతులు లజ్ చర్చి రోడ్‌లోని మా సభ ఆవరణకి విచ్చేశారు. అక్కడ సమావేశమైన — సహాయ కార్యదర్శినిలూ, కార్యకర్తలూ, ఆఫీసు సిబ్బందీ, విద్యార్థినిలూ మున్నగువారు రాజదంపతులకి పూలమాలలతో స్వాగతం చెప్పారు. శ్రీ సాంగ్లీరాజ దంపతులు దాక్షిణాత్య శాస్త్రీయ సంగీతం వినవలెనని కూతూహలం కనబరచగా ఆ నాడు ప్రత్యేకం మా సభలోని సంగీతోపాధ్యాయినీ, నర్సింగ్‌హోమ్, సభహాస్టలు విద్యార్థినిలూ, శ్రీమతి కోకా సత్యవతి మున్నగువారు శాస్త్రీయ లలిత సంగీతాలని వినిపించారు.

శ్రీమతి కోకా సత్యవతీ, మాసభ సంగీతోపాధ్యాయినీ వీణా వైలెన్‌లు వాయించారు. నర్సింగ్ హోమ్ నుండి సునందినీ, రంగలలిత గీతాలు పాడారు. ఇవిగాక మహిళా సభ విద్యార్థినిలు బృంద గీతాలు పాడారు. ఆనాటి సంగీతం విని అతిథులు మిక్కిలి ఆనందించారు. అనంతరం ఆంధ్రమహిళా సభ వ్యవస్థాపకురాలు శ్రీమతి దుర్గాబాయ్ దేశముఖ్ సాంగ్లీ రాజ దంపతులు, ఎంతయో వ్యయప్రయాసలకోర్చి, తమ మాట మన్నించి వచ్చి గృహ ప్రవేశోత్సవ సభలని జయప్రదం గావించినందుకు కృతజ్ఞత తెలిపారు. సాంగ్లీ రాజదంపతులు, ఆంధ్ర మహిళా సభ పరిచయం తమకొక మరువలేని మధురానుభూతివలెనిల్చి పోతుందని చెపుతూ, ఈ సభ చేస్తున్న మహిళా సేవనికొని యాడారు. ఆంధ్ర మహిళాసభ చూపించిన ఆదరాభిమానాలు, అతిథి మర్యాద మరుపురాని ఒక అపూర్వ అనుభూతి అన్నారు, శ్రీ రాజ దంపతులకు శ్రీమతి దేశముఖ్, మా సభ కార్యదర్శినిలూ, ఆఫీసు సిబ్బందీ, విద్యార్థినులు మున్నగు అనేక మంది రైలు స్టేషనుకి వెళ్లి వీడ్కోలు ఇచ్చారు.



## ఆంధ్ర మహిళాసభ నర్సింగ్ హోమ్

మద్రాసు సిటీ డెవలప్ మెంట్ కమిటీ ఆధ్వర్యాన ఏర్పాటు చేయబడిన — కూరగాయ తోటల ప్రదర్శనలో — ఆంధ్ర మహిళా సభ నర్సింగ్ హోమ్‌కి 'వెండికప్పు' ప్రధమ బహుమతిగా వచ్చినది. సంస్థల కేటగిరీ మూడు క్రింద నొసంగబడిన యీ బహుమతి ప్రధానోత్సవంలో మద్రాసు ప్రభుత్వా మాత్యులు శ్రీ కక్కన్ - యీ వెండికప్పు నొసగారు. శ్రీమతి శ్యామలా గిరిమాజీ మా సభ తరఫున యీ బహుమతి అందుకొన్నారు.

ఆక్జలరీ నర్స్‌మిడ్ వైఫ్ కోర్సు పరీక్షకు హాజరయిన పదకొండవ బాచి జూనియర్ విద్యార్థినిలు 22. మందిలో యిర్వై ఒక్క మంది ఉత్తీర్ణులయినారు. వీరిలో కె. వెంకటసుబ్బమ్మ, యల్. ఆంధ్రారత్నం, ఎ. వెంకటలక్షమ్మా, డి. కె. సరోజిని, పి. యశోదమ్మ, యమ్. ప్రేమసామ్రాజ్యం, డి. అన్నపూర్ణమ్మ ఎలిమెంటరీ నర్సింగ్ పరీక్షలో ఉత్తమ శ్రేణిలో ఉత్తీర్ణులయినారు.



# FAMILY PLANNING:

No .. ... ... . .. R/U

**Return for the month of November 1963.**

**Address of clinic ANDHRA MAHILA SABHA NURSING HOME & FREE DISPENSARY, No 3, Adyar Bridge Road, Madras-28**

| | Up to the end Of previuos month. | During month under review |
|---|---|---|
| Population served by the clinic - | | |
| 1 Persons contacted for F.P education. | 22347 | 670 |
| 2 No of cases given advice. | 1209 | 15 |
| 3. No of active cases following F P. Methods. | 660 | 665 |
| 4 Clinic attendance. | 35301 | 420 |
| 5. No. of new persons visited at home for:- | | |
| (1) New contacts | 9925 | 385 |
| (2) follow-up. | 6548 | 309 |
| Cost of contraceptives (in Rs.) supplied by the Clinic - | Rs np | Rs np. |
| 6 Free. | 6352-06 | 164-90 |
| 7 At half rates | 210-34 | ... |
| 8. At full rates. | 202-93 | ... |
| 9. Total. | 6765-33 | 164-90 |
| Sterlization cases referred to Hospital - | | |
| 10. Male. | 243 | 5 |
| 11. Female | 480 | 6 |
| 12 Total. | 723 | 11 |
| Nature of advice given (Give No of cases) | | |
| 13 Diaphragm and Jelly. | 345 | 4 |
| 14. Jelly alone | 296 | 11 |
| 15 Sheath | 11 | ... |
| 16 Safe period | 215 | 10 |
| 17. Foam Teblets | 87 | |
| 18. Others (Specify) | | ... |
| 19 Total | | |
| Meetings - | General | Group |
| 20 No held | 69 | 78 |
| 21. No of persons attended. | | |

Signature officer Incharge. (Sd) K R. Ambuja.



# ★ తక్షశిల ★

వారణాసి
యశోదాదేవి

భరత ఖండమున కాశ్మీరము ప్రకృతి శోభానిధానమైన, గాంధారము మహోత్కృష్ట కళానికేతనము. కాశ్మీరమున శారదా పీఠము వెలసినది! గాంధారమున విశ్వ విద్యాలయము విశ్వ విఖ్యాతి గాంచినది. కాశ్మీరమున సతీశివులు విహరించిరి! దేవగంధర్వుల నిలయమే గాంధార భూమి. పాండిత్యమున కాశ్మీరమువలె శిల్పముందే గాదు, గాన కళయందు గాంధార దేశము సుస్థిర విశిష్టతగాంచి యున్నది. పాల్కురికి సోమనాథుడు పేర్కొనిన ముప్పది రెండు వీణాభేదములలో గాంధర్వ వీణ యొకటిగలదు. కాశ్మీరమునకు శ్రీ నగరమునకు వలె గాంధార రాజ్యమునకు రాజధాని తక్షశిలా నగరము.

నైసర్గికముగ గాంధారపు సరిహద్దులు సుస్పష్టముగావు! వీనిగూర్చిన భేదాభిప్రాయములు గలవు. సింధునది నుండి కుభా (ప్రస్తుతపు కునార్ లేక, కాబూలు నది) వరకు విస్తృతమైన నదీతీరమే పూర్వపు గాంధార దేశము అనగా పాంచాలపు (పంజాబు) టుత్తర భాగమున ప్రస్తుతపు రావల్పిండి పెషావరు మండలములకు సరిపోవుచున్నది. ఇవియేగాక స్వాత్ సంస్థానము, హోతీమర్దన్ అనగా యూసప్ జాయిలోవ దేశము గాంధారములో నిమిడి యున్నవని కొందరితలంపు. యూసప్‌జాయి దేశమున సింధు పాంచగోరాల నడుమ భూమియే యీలోవ. ఈ గాంధారమునకు అనగా యూసఫ్‌జాయ్ లోవ దేశమునకు తూర్పుదిశను సింధు నదియు, దక్షిణదెసను కుభానదియు, పశ్చిమపార్శ్వమున బెజవారు, శుభవస్తు(స్వాత్) నదియు, వుత్తరపు దిక్కున చిత్రాల్, యాసిన్ సంస్థానములు సీమలై యున్నవి. ప్రస్తుతము ఆఫ్గనిస్థాన్‌లో నున్న కాందహార్ పూర్వము గాంధార పురమైయుండుననియు, దీన్ని బట్టి గాంధార దేశమనియో కానిపక్షమున గాంధార దేశమును బట్టి గాంధార పురమనియో బిల్వబడి యుండునని కొందరి వూహా! కాని యిందులకు నిదర్శనములు

మృగ్యము. రామాయణములో గాంధార దేశము గాంధర్వ దేశమని ధ్వని యిచ్చునట్లు జెప్ప బడినది. మహా భారతములో గాంధర్వ దేశమన బడినది, యిదియే గాంధారమని యనేకుల యభిప్రాయము. గ్రీకులపాలన కొంతవరకు నిట స్థిరమై, గాంధారము నవీనమైన గ్రీసుయన బడుచుండెను. బౌద్ధులకు పుణ్యభూమి గాంధార దేశము

తక్షక శిలానగరము లేక తక్షశిల-నేటి టాక్సిలా- పంజాబులోని రావల్పిండి జిల్లాషాధేరి నుండి 8 మైళ్లదూర మందున్న శిథిలములందు గాన నగు చున్నది. కాలకా స్పెషల్ రైల్వే స్టేషను నుండి రెండు మైళ్లదూరమున రావల్పిండి పురమునకు వాయవ్యముగ 26 మైళ్లదూరమున తక్షశిల శిథిలముల దిబ్బలుగాన వచ్చుచున్నవి. కథాసరిత్సాగరమున తక్షశిలా నగరము వితస్తానదీ తీరమని గలదు కాని నిజమున కది సింధునదికి కొంచెము దూరమున నున్నది! వితస్తనదీబహుదూరముగ నున్నది. తక్షశిలా ప్రాంతమున ప్రకృతి రమణీయత వర్ణనాతీతము ఈ నగరమున్నలోయలో హారోనది యెన్నో వుపనదులతో ప్రవహింపు చుండును. రక్షణకు వడ్యాణము వలె కొండలు జుట్టుముట్టి యుండును. అవియేవుత్తర, తూర్పు దిక్కులందు హిమావృతమైన హజారా, ముర్రీపరుసులు, దక్షిణ, పశ్చిమములందు మార్గల్లా, తదితర చిన్న పర్వతములు నై యున్నవి. తక్షశిల హిందు స్థానమును మధ్యదేశము, పశ్చిమ హిందూ దేశములలో గలుపు వాణిజ్య, వర్తక వ్యాపారములకు కూడలిస్థానమై యుండెను. నైసర్గిక మైన రక్షణ సదుపాయములును, సారవంతమైన భూమియు, చక్కని నీటివనరులును గల తక్షశిల ప్రాచీన కాలమున సర్వోత్కృష్టత నందియుండుటయు సహజమే, అలగ్జాండరు కాలమున తక్షశిలా సింధు జీలమ్ నదుల మధ్యనున్న పట్టణము లన్నిటి యందును మేటియై సర్వసంపదల ననుభవింపుచు వుచ్చదశ యందునటు చరిత్ర కారుడు Arrian వర్ణించెను. తక్షశిలా పరిసరము లందు పర్వత సానువులు సమతల భూములలో కలియు చున్న ప్రాంతము లగుట వలన నేల మిక్కిలి సారవంతమై మిక్కుటమైన జనసమ్మర్దముచే కళకళలాడుచుండెననియు Arrian సమకాలికుడైన Strabo విరచించి యున్నాడు. Plutarch సైతము తక్షశిల సస్య సంపదల బేర్కొని యున్నాడు. చైనీయుడైన హుయన్ త్సాంగ్ మనోహరమైన ప్రవాహములను, భాగ్యమును సూచించు దట్టముగ బెరిగిన చెట్లుచేమలను వర్ణించి యున్నాడు.

ఈశాన్యము నుండి ఆగ్నేయమునకు వ్యాపించియున్న కొండ చరియ పశ్చిమభాగమున హాథియాల్ యనబడుచు లోయ తూర్పు భాగమును రెండుగ విభజింపు చున్నది! వీనిలో వుత్తర భాగము హారోనది వున్నత ప్రదేశముల నుండి త్రవ్వబడిన కాలువల వలన సస్యశ్యామలమై ఫలవంతమై యున్నది. ఇందు హారో వుపనది యైన లుండినలా ప్రవహింపు చున్నది. దక్షిణపు లోయ భాగములో గ్రీకు రచయితలచే Potomas యన బడిన టాంబ్రా లేక తామ్ర నాళానది—అదియే Tiberonobo లేక బైబరీసు-బోవు చున్నది. ఈ ప్రాంతమున నరణ్యములు శిలల గుట్టలు, పూర్వపు స్తూపముల, సంఘారామముల శిథిలములు యధికముగ గలవు. ఈ లోయ-అదియే తక్షశిలా లోయ-లో, నొకదాని కొకటి 3½ మైళ్ల దూరమున మూడు పట్టణముల శిథిలములు గలవు. అవి యేభీర్, శిర్కాపు, శిర్సుఖ్ యనుబడు చున్నవి.

వీనిలో భీర్ దిబ్బ పురాతనమైనది. ఇది తక్కిన రెంటి కంటెను దక్షిణపు వైపుగ వున్నతమైన పీఠభూమి, ఎత్తు 60 నుండి 70 అడుగుల వరకు నుండును. దీని నిడివి వుత్తరము నుండి దక్షిణమునకు 1200 గజములు! వెడల్పు తూర్పునుండి పశ్చిమమునకు 730 గజములు, ఇచట గ్రీకుల యోగ మనమునకు ఘోరమే తక్షశిల రాజధాని పట్టణముగ

మహోన్నత దశనను భవించెను. గ్రీకులు వచ్చి తమ రాజధానిని శిర్కాపుకు మార్చుకొనిరి

శిర్కాపు నగరము హాథియాల్ పర్వతపు పశ్చిమపు కొమ్మున గలదు. ప్రస్తుతమా ప్రాంతము బాబఖాన లేక కచ్చకోట యనబడు చున్నది. ఈ పట్టణపు లోపలి కుడ్యము ఇండో సిథియను రాజైన Azes I చే క్రీ. పూ. మొదటి శతాబ్దములో నిర్మింపబడెను. పట్టణకుడ్య ఆవరణలో హాథియాల్ కనుమ, చదునైన మరొక కొండ వీని రెంటికుత్తరముగ మరొక పీఠభూమి యిమిడి యున్నవి. ఈ గోడనిడివి సుమారు 6000 గజములు, 'యిది 15 నుండి 21' 6'' వరకు మందమై యున్నది. దీని బురుజులు సమకోణ చతురస్రా కారమున నున్నవి; కాని కుడ్యము మిక్కిలి బలిష్టమైనది గాదు. చదునైన కొండ పైపూర్వము శిర్కాపుకు ముఖ్యమైన రక్షణ దుర్గముండి యుండును. రెండు కొండలకు మధ్య నున్న పల్లపు నేలయందు దుర్గమును ప్రవేశించుటకు ద్వారముండి యుండును. ఈ దుర్గమున కుత్తరమును, హాథియాల్ కనుమ కుత్తరమందును దుర్గపు లోపలి కుడ్యపు శిథిలములు గాన వచ్చుచున్నవి.

తక్షశిలలో మూడవ పట్టణమైన శిర్సుఖ్ నగరము యింకను యీశాన్య మునకు లుండే నాలా నదికి ఆవలి వైపున గలదు. దీనిని కుషానుల కాలమున కనిష్క మహారాజు గట్టించి యుండును. ఈపురము సమభుజ చతురస్రమై యున్నది; చుట్టు ప్రాకారము 3 మైళ్ల విస్తృతి గల్గి యున్నది; దక్షిణపు వైపున, పూర్వదిశను కుడ్యము భద్రముగ నున్నది; కుడ్యపు సాంద్రత 18అ కు పైగానున్నది. వెలుపలి వైపునవల యాకారమున నున్న కుడ్యములచే రక్షిత మగు చున్నది. పట్టణపు సరిహద్దులలో నిపుడు ప్రాచీన శిథిలముల పైన మూడు గ్రామములు మోర్వా [illegible] యున్నవి. ఇవిగాక పరిసర ప్రాంతము లందు యెన్నియో కట్టడములు, బౌద్ధస్తూప ములు, సంఘారామ ములుగలవు.

పాంచాలమును బాలించిన ద్రుహ్యు వంశము. తొమ్మిది పురాణములలో జెప్పబడి యున్నది మను వంశములో యయాతికి పిమ్మట ద్రుహ్యుని కుమారులు భయులు భ్రభువు, సేతువులు. వీరిలో సేతువు వంశకుడు గాంధారుడు. అయోధ్యాధిపతులైన యిక్ష్వాకులకును, ద్రుహ్యులకు సమరములు జరుగుచుండెను, మాంధాతృమహారాజు, పాంచాలపు సరిహద్దు ప్రాంతముల నేలుచున్న అరుద్దయను ద్రుహ్యు రాజు నుమడియించెను, అతని తదనంతరము రాజ్యమునకు వచ్చిన ద్రుహ్యుమహారాజు గాంధారుడు యింకను వాయవ్యమునకు తరిలి రాజ్యము నెరపెను, కాబట్టి పౌరాణికముగ గాంధార మహారాజు పాలించినది, గాంధార దేశము, రాజ్యము ననిసుస్పష్టమగు చున్నది. ద్రుహ్యులను గాంధారమునకు తరుముట, యందు ఆనవ మహారాజులు యిక్ష్వాకులు తోడ్పడి యుండురు ఈ ద్రుహ్యు రాజులు గాంధారమందేకాదు; యింకను వాయవ్యమున మ్లేచ్ఛ దేశములలో సైతము తమ రాజ్యముల స్థాపించియుండిరి.

ఇక్ష్వాకులలో ప్రఖ్యాతుడైన దశరథ రాముడు అయోధ్యను బాలింపగా, సోదరులు యితరత్ర రాజ్యములు జేయుచుండిరి. తల్లినిబట్టి భరతునకు కేకయ రాజ్యము లభించెను, భరతుని కుమారులు తక్షుడు, పుష్కరుడు అనువారు గాంధార దేశమును జయించి తక్షశిలయందు జ్యేష్ఠుడును, పుష్కరావతియందు కనిష్ఠుడును యేలిరి కాబట్టి. తక్షుకుడనునా మాంతరము గల భరత పుత్రుడు తక్షుడు గాంధార రాజ్యమున తనబేరున తక్షశిల, అదియే తక్షక శిలానగరమును నిర్మించి. నది రాజధానిగ బరిపా[illegible]పెను, గాంధారాధీశుడగు సుబలుని కుమారై [illegible]

భారత యుద్ధములో నశేష క్షత్రియ రాజన్యులు మడియగా, వుత్తర దేశమందుగల్గిన సంక్షోభములో నాగరాజులు తక్షశిలలో స్థిరపడి హస్తినాపురమును గెల్చిరి; పాంచాల రాజ్యములు పతనమయ్యెను. కశ్యపునకు కద్రువకు తనయుడై, వాసుకి మొదలగు వారిని సోదరులుగా గల తక్షక నాగుడు, మహారాజు పరీక్షిత్తు II ను హత మార్చెను. అంతట పరీక్షిత్తు కుమారుడు మహారాజుజన మేజయుడు III సర్ప యాగము జేసి నోడించెను; ఎందరనోద్రవింప సెజేను. కాని తక్షకుడు, వాసుకి యిత్యాదులు నాగుల సురక్షితులై యుండిరి.

గ్రీకులు, రోమనులు తక్షశిలను తఖశిలయనిరి; టాక్సిలా యనిరి, టిబెట్టు భాషలో Taxila అనగా కోతరాయియని అర్థము; కాబట్టి విదేశీయులు శిలలభేదించి నిర్మింపబడిన పట్టణము (The city of cutstone) యను భావమున తక్షశిలను (Taxila) అని యుందురు. చైనీయుడు ఫాహియాన్ దీనిని (Chu-shu-shilo) అనగా నరుకబడిన శిరముయని పేర్కొనుచు బుద్ధుడు యిచట - తక్షశిలలో - తనశిరమును తిరిగిదాన మిచ్చెనని జెప్పెను.

మతపరముగ గాంధారమును, అందును తక్షశిలయు భౌద్ధ పుణ్యభూములు. బౌద్ధమును దేశాంతరముల సైతము విస్తృత పర్చిన అశోక ధర్మచక్రవర్తి గాంధారమును బౌద్ధ సర్వస్వమునకు నాయువుబట్టు జేయుటయం దాశ్చర్య మేమున్నది? బుద్ధుడు పూర్వ జన్మములయందు మణిక్యాలయాదు తన దేహమును, పెషావరు బునార్ కొండలమధ్య నున్న గిరిరై యొద్ద తన శరీరమాంస శకలమును, రాజధాని పుష్కలావతి (ఛర్సడ్డా) దుర్గముపై తన చక్షువులను, తక్షశిలయందు తన శిరమును దానము జేసెనని జాతక వాఙ్మయము జెప్పుచున్నది. అశోకుడు యీ నాల్గు క్షేత్రములందును గొప్పస్తూపముల నెత్తించెను. బుద్ధుడు తన శరీరమును యాకలిచే తిన సంతానమునే భుజించి వేయుచున్న యొక యాడు పులి కాహారముగ నిచ్చెననియు, ఆ జన్మమున బుద్ధుని నామధేయము బ్రహ్మ ప్రభర్షి యనియు, నాతావు పుష్కలావతీ పరిసరయరణ్యమనియు దివ్యావధానమాలయను బౌద్ధ గ్రంథమున గలదు. అది యేనేడు చింద్, ఉండ్ యన్న పేరున సింధునదు దక్షిణ తటమున పెషావరుడివిజనులో నున్నది. అశోకుడు క్రీ.పూ. 245 సం॥లో గాంధారమున బౌద్ధవ్యాప్తికై ఝాంతికుని బంపెనని మహావంశము జెప్పుచున్నది. చక్రవర్తియగుటకు పూర్వము అశోకుడే తక్షశిలయందు గాంధార రాష్ట్రమునకు అనగా మౌర్య వాయవ్య సరిహద్దు రాష్ట్రమునకు రాజప్రతినిధిగ నుండెను. అశోకుని కాలమున తక్షశిల బౌద్ధ యాత్రా స్థలముగ నుండెను, కొన్ని బౌద్ధ గ్రంథములయందు బుద్ధుడు వెనుకటి జన్మములో భద్రశైలన్న పాలుడనియు, పేరు చంద్ర ప్రభుడనియు, నొక బ్రాహ్మణ యాచకునకు సర్వము వదలివేయ, నాతని పేర నాటినుండి భద్రశైలము తక్షశిలగ మారెననియు జెప్పబడినది. కాని రామాయణ కాలమునుండియు తక్షశిల గానవచ్చుచున్నయందున నీఐతిహ్యము విశ్వాసనీయముగా జాలదు. అపర అశోకుడైన కనిష్కుని కాలమునందు గాంధారమున బౌద్ధము యతిశయించెను

కాని తక్షశిల శిధిలములందు విష్ణుయారాధనా చిహ్నములును గానవచ్చినవి; జైనమత విస్తృతియు గోచరింపుచున్నది. వర్తక రహదారులకూడలియు, విశ్వకళా పరిషన్నిలయమును, బౌద్ధకేంద్రమును, భారత సామ్రాజ్యములకు పొలిమేర ప్రాంతమునగుట, విదేశీయుల యాగమనమునకు, స్థావరమునకు వివిధ సంస్కృతుల సమన్వయమునకు తక్షశిలా క్షేత్రము కారణమయ్యెను. ఇచట మత సహనము సామాన్యమయ్యెను; వర్తక సంఘములు తమ నాణెముల ముద్రించుచుండెను; ఇచట పారశీకుల యారాధనా నిలయము (Tower of silence) యుండెను. ప్రజలు స్వాతంత్ర్య కాంక్ష గల్గియుండిరి; జైన బస్తీలునుయుండెను.

(సశేషము)



With Gandhiji's blessings, we started But we did not then know that it was a long path, the path of usefulness and Service

Our aim was to build just a school, and when we achieved it, the success goaded us on to new adventures, - Industrial Institute for Women, a Sisu Vihar, and then a Nursing Home and an Orthopaedic Centre for children. Our activities have extended to Hyderabad also We have, besides, taken up training programmes for Mid-wives and Nurses, Craft teachers and for Family Planning - for harnessing their services in building our Nation The path of Service Gandhiji led us into is endless and ever-inspiring

On this occasion of the Silver Jubilee of our Sabha, we take the pledge, once again, to give our best to the Nation, and it is our privilege we are taking this pledge before the President of our Nation, Dr S Radhakrishnan who is inaugurating our Silver Jubilee Celebrations to-day.

27th May 1962 **Durgabai Deshmukh**

" My two daughters studied in the school run by the Andhra Mahila Sabha in Mylapore, and they received enormous benefit from the study there The management is entirely in the hands of women devoted to the cause of upbringing our women The Andhra Mahila Sabha can boast of many a young woman who has received instruction during her stay there "

— **M. Ananthasayanam Ayyangar**

*Governor of Bihar*





Mahila Vidyalaya

It was - in 1937 - a children's club, where the little ones played and learned their lessons in music and dance

Their mothers came along and started learning themselves - Hindi, Matriculation Classes, and then a Science Section with a laboratory, and a Hostel with a play ground have come in The little ladies have thus founded a Mahila Vidyalaya.

500 women have so far passed the Matriculation Examination of the Banares and Andhra Universities A Scheme of condensed course of Education and Training for Adult women is also being implemented with the assistance of the Central Social Welfare Board

They are given Training in craft and Technique of Small-scale Industry to augment earnings of the Home






In 1940 Shri Vikramadev Varma, Maharaja of Jeypore visited the Sabha, when it was yet an infant institution and gave us equipment to start training in manufacture of paper, mat-weaving and Rattan work That was the beginning of the Industrial Institute Donations from our members and the matching Grants from the Government of India and Government of Madras have helped development of the Institute

So far 300 women have passed the technical examinations in needle work, Embroidery and dress making Some have had their training in dyeing and printing and knitting by hand machines Our printing Press prints 'Andhra Mahila', and trains women in Composing, Printing and book-binding



In Madras, and in our Branch at Hyderabad Handloom Training-cum Production Units are functioning We are obliged to the All India Handloom Board for this Scheme entrusted to us

Sixty women have so far been trained in all the processes of weaving, and forty-five of them are now engaged in the production of fabrics They earn their wages to supplement the man's income at home and to keep their children going to school.

Marketing problem has not yet arisen, for our members buy up the entire production—of sarees, towels, bed-sheets etc



There are creches to look after children in factories and organised Industries, but there are none for taking care of children of the middle and lower middle class women when they go for work as Typists or Clerks Nageswara Sisu Vihar is designed to meet this need The present strength is 35 in the age group of 3 and 6 They are attended to by a Montessori trained teacher and an ayah Free lunch is provided to the children

We have added an elementary school section to this There are over a hundred children in the first, second and third standards, taught in Telugu, Tamil and English medium



Vanitha Bala Vihar

A Park and a Play-ground for Women and Children

It is not our own, the Corporation have allowed us to use it, and vacate it when they ask us to We built an elementary school for kids and an open-air stage for their entertainment Over a hundred women and children use the Park every day for their recreation

# అరకు వేలి



అరకులోయ అన్నది విశాఖపట్నం జిల్లాశృంగవరపుకోట తాలుకా ఏజన్సీప్రాంతంలో ఉంది. విశాఖపట్నం నుండి అనంతగిరి మీదుగా జయపురం పోయే రోడ్డున 64వ మైలు నుంచి 71వ మైలు వరకు వ్యాపించి ఉంది. ఈ ప్రాంతాలన్నీ తూర్పు కనుమల కొండలు లోయలతో అతి రమ్యంగా ఉంటాయి. అరకువేలి వెడల్పు 3 మైళ్లు దీనికి తూర్పున 'లబుడు' లోయ, ఉత్తరాన కొద్ది దూరంలో ఒరిస్సా సరిహద్దు, పడమట 'కురిడీ' లోయ, దక్షిణాన్ని 'సుంకరమెట్ట' సరిహద్దులు ఈ లోయకు మధ్యగా దక్షిణాన్నుంచి ఉత్తరం వైపుకు 'పాతాళగెడ్డ' అనే కొండయేరు నిత్య పుష్కరిణిగా ప్రవహిస్తూ ఉంటుంది. లోయలోని భూములు రెండు వైపులవి ఈయేటివైపుకు వాలుగా ఉంటాయి. లోయను లోతుగా కోసుకొని ప్రవహించే పాతాళగెడ్డ నిజంగా పాతాళ గెడ్డే!

అరకు లోయలో సాలుకు సగటు వర్షపాతం 55అం॥, అంటే 110దుక్కాలన్న మాట దీంట్లో ఐదోవంతు వేసవి జల్లుగాను, మరో ఐదోవంతు ఈశాన్య ఋతుపవన కాలంలోను పడుతుంది. జనవరి-ఫిబ్రవరి నెలల్లో సుమారొక్కొక్క పాతికదుక్కా, మార్చిలో రెండు దుక్కాలు, ఏప్రిల్ మే నెలల్లో తొమ్మిది, పదేసి దుక్కాల వర్షం పడుతుంది. ఈ కాలంలో గొప్ప గాలితో వడగళ్లవానలు మామూలు. మొత్తం మీద ఈ వేసవి జల్లు, వడగళ్లు, చాల ఆహ్లాదకరంగాను,

శీతలోపకరణంగాను ఉంటాయి. అరకులోయలో అత్యధిక తాపక్రమం 100, అత్యల్ప తాపక్రమం 36 డిగ్రీల ఫారన్‌హీట్ ఉంటుంది, అంటే వేసవిలో తక్కిన్ని ప్రాంతాలకంటె చాల చల్లగాను శీతకాలంలో (మరో నాలుగు డిగ్రీలు తగ్గితే నీరు పేరుకుపోయి, మంచుగడ్డగా మార్పడేటంత) హెచ్చు చలిగాను ఉంటుంది. ఈ లోయప్రాంతాలు సముద్ర మట్టం మీద మూడు వేల నుంచి ఐదు వేల అడుగుల యెత్తువరకు ఉంటాయి. అందుచేతనే ఈ చలినీ, తన్మూలంగా వేసవి విడిదికి అనుకూలంగా ఉండడమున్నూ. అరకువేలీ అనేక హేతువుల వల్ల ప్రజలకు ప్రభుత్వానికీ గూడ వేసవి విడిదిగా నుండ దగ్గది ఇలాంటి విడుదుల కుండవలసిన లక్షణాలు చూద్దాం. (1)సముద్రమట్టం మీద ఎత్తున ఉండాలి. (2) వేసవిలో చల్లగా ఉండలి. (3)తగుమాత్రపు వర్షపాతం ఉండాలి. వీటిసంగతి పైన చెప్పేను. (4)ఈ ప్రాంతం ఆరోగ్య వంతమైనదై ఉండాలి, దీన్ని గురించి వివరిస్తాను. (5)చేరడానికి చక్కటి రస్తాలుండాలి :-అరకులోయ వెళ్లడానికి ఒకటో రకం రహదారీ, బస్సు రూటుగల రోడ్డుఉంది సమప్రదేశమైన మైదానాల మీద 5 మైళ్లూ, ఘాటీ (అంటే ఎత్తునెక్కడానికి కొండ పార్శ్వాల వెంట పాము మెలికల్లాగ తిరుగుతూ క్రమంగా పర్వతారోహణ గావించడానికి వేయబడ్డ) రోడ్డు 20మైళ్లు ఉంది. వాల్తేరు, విశాఖపట్నం నుంచిగాని విజయనగరం నుంచిగాని, ప్రొద్దుట బస్సులో బయలుదేరితే శృంగవరపు కోట బొడ్డవరం మీదుగా పదిగంటలకల్లా అరకులోయ చేరగలం. ఈ రోడ్డే జలవిద్యుత్పత్తికేంద్రమైన మాచ్‌ఖండ్ (డుడుమా)కు వెళ్ళేది గనుక, పెద్దలారీలు, బరువులు, వెళ్ళడానికై ఈఘాట్ రోడ్డు పార్శ్వాల్లోని కొండలన్నీ పేల్చి, పిండికొట్టి, రోడ్డు వెడల్పు పెంచారు. ప్రయాణం చాలా సౌకర్యంగానూ, నిరపాయంగానూ అడుగడుక్కీ ఆనందప్రదంగాను ఉంటుంది. (6)ప్రకృతి రామణీయకత ఉండాలి :- త్రోవ పొడుగునా కొండలూ, రమణీయమైన లోయలూ ఉంటాయి. వాల్తేరు దగ్గర కొండలు సింహాచలం ప్రక్క కొండలు, శృంగవరపుకోట దగ్గర 'పుణ్యగిరి' కొండలు చూచుకుంటూ బొడ్డవరం అనే ప్రాంతం దాటిన దగ్గరనుంచీ ఘాట్ రోడ్డు ఎక్కుతుంటే మరీ బ్రహ్మాండమైన కొండలూ నదీ నదాలూ చిట్టడవులూ-కారడవులూ, అగాధమైన లోయలూ ఆశ్చర్య సంభ్రమాలు కొలుపుతూ, ఏ వంకచూచినా నేత్రానందంగాను హృదయరంజకంగాను, కొండలెక్కేకొలది అంతకంతకూ చల్లగాను ఉంటూ, మరోప్రపంచంలోకి గంధర్వలోకానికి వెళ్లుతున్నామా అన్నట్లు తోస్తుంది. అక్కడక్కడ కొండప్రాంతాల్లో చెట్లు నరికేసి, కొండప్రజలు "పోడు" సేద్యం చేయడం చూడవచ్చు. వారూ, వారి గ్రామాలూ, పూరిళ్లూ, వారికట్టూ, భాషలూ బహుచిత్ర విచిత్రంగా ఉంటాయి, అరకులోయలో మాత్రం గ్రామ పరిసరాల్లోను, కొండచివరనూ తప్పించి, చెట్లు కొట్టేయడం జరిగించేరు. ఇలా అడవులు నరకడంవల్ల, నేలకోత, భూముల నిస్సారం, వర్షపాతం శీతోష్ణ పరిస్థితులు కొంత మారడం జరుగుతుంది, జరిగింది. ఈ పరిస్థితుల నరికట్టడానికి వ్యవసాయ శాఖవారు ఈ ప్రాంతాల్లో "వాలునుబట్టి గట్లు" Contour bunds వేసేరు. మొత్తంమీద అరకులోయ అమితానందదాయకంగా రమణీయకంగా ఉంటుంది. ఒక్కసారి వెళ్ళిచూచినవారు మళ్ళీమళ్ళీ వెళ్ళాలని ఎంతైనా ఉబలాట పడతారు. అక్కడి దృశ్యాలు పెద్దల్నీ, పిల్లల్నీ స్త్రీలను పురుషుల్నీ కవుల్నీ సామాన్యజనుల్నీ ప్రభుతోద్యోగుల్నీ-ప్రజల్నీ అందరినీకూడా రంజింప జేసేవిగా ఉంటాయి. ఎటుచూచినా కొండలే, ఎటుగాంచినా లోయలే, అరణ్యాలు, కొండవాగు కోలు, యు గ్రామాలు చూడ్డానికి రెండుకళ్ళూ చాలవ

పిస్తూఉంటాయి. దక్షిణాన్ని సుంకరమెట్టఆ; కొండనుండి దిగజారే వెండితీగలాంటి పాతాళగెడ్డ; పరిసర పర్వతశ్రేణుల్లో పుట్టి, దీంట్లో సంగమం జెందడానికి ఝరీవేగంతో, సంగీత నినాదాలతో ప్రవహించే (గెంజిగెడ్డ, చిన్నగెడ్డ, కోడిగెడ వగైరా) అనేక ఉపనదులు. ఇవన్నీ పాతాళగెడ్డలో కలిసి, అరకుగ్రామం మీదుగా పోయి, మాచ్ ఖండ్ నదిలో కలియడం; ఆనది శబరిలో చేరడం, ఇలా లెక్కలేనన్ని నదీ-నదాలు పర్వతశ్రేణులూ ఉంటాయి. ఒక మహాకవి వర్ణించినట్లు ఇలాంటిచోట్లు ("Tongues in trees, Sermons in stones, Books in running brooks, and Good in everything . . . ") వృక్షాల్లో జిహ్వాలు, గిరుల్లో తత్వాలు నదుల్లో గ్రంథాలూ, సర్వంలోను సత్యం-శివం-సుందరాల్ని దర్శిస్తుంటే ప్రకృతే ఒక పుస్తకం లాగ మనలో అవ్యక్త మాధురీ రీతులలో అనేక అనుభూతుల్ని కలిగిస్తుంటుంది.

(7) మంచి పరిసర ప్రాంతాలుండాలి అరకు లోయ పరిసరాలలో ఇంకా అనేక రమణీయమైన లోయలు, దృశ్యాలు వున్నాయి. త్రోవలో 'అనంతగిరి' దగ్గర అనంతమైనపర్వత శ్రేణులు. అనుగుణ్యమైన రహదారి బంగళా, కాఫీతోటలు ఉన్నాయి. దీనికి 5 మైళ్ళలో "బొర్రాగుహ" లని తాళ్ళప్రమాణంగల బ్రహ్మాండమైన, భయానకమైన, ప్రకృతి సిద్ధమైన చలువరాతి కొండలలో ఏర్పడ్డ గుహాలూ, వాటిలో సహజంగా యేర్పడి కప్పునుంచి క్రిందకూ, క్రిందనుంచి కప్పుకూ పెరిగే (Stalegmite, Stalectite) స్తంభాలూ, అంతులేని సొరంగాలు, ఆ సొరంగాలలో "గోస్తనీ" నది ఉత్పత్తి త్రోవలో అల్లుకుపోయిన వెదురు డొంకలూ, అభ్రకం (Mica) గనులూ—ఇలాంటి అపూర్వ సౌందర్య ప్రకృతి దృశ్యాలెన్నో చూడదగ్గవి వున్నాయి. అనంతగిరి దాటేక 'సుంకరమెట్ట' అక్కడ ఆకాశాన్నంటే "పీటికిన్ బెట్టనిపెద్ద వృక్షములవీక్షసోసంగెడి పెన్నుట్టలు" ఐదువేల అడుగుల ఎత్తుగల 'గాలి పర్వతం' దాని ప్రక్కను ప్రాకే పాములాగ వేయబడ్డ ఘాట్ రోడ్డు; అటుఆకాశాన్ని తాకే కొండ, ఇటు పాతాళలోకంతోపింపజేసే బ్రహ్మాండమైన లోతుగల గొప్పలోయ. ఇవన్నీ బలే తమాషాగా ఉంటాయి. అరకు లోయ పరిసరాలలోయలైన, (లబుడు, మాల సింగారం, కురిడి, జన్నంగుడవగైరా) అనేక లోయలూ, అరణ్యాలూ, నదులూ గిరులూ, గిరి జనులూ అన్నీ చూడదగ్గవే. ఉత్తరాన్నీ మళ్ళీ ఆకాశం తాకేటట్లు 'శంకరన్ గుట్ట' దానిపై Geological Survey of India వారు 'Bench mark' గా ఉపయోగించిన శిఖరాగ్రం, ఈ పర్వతం సముద్రమట్ట పై 5,000 అ॥ ఎత్తు. దీన్నుంచి నింగినుంచి భూతలాని కురికేటట్లు ఓంకార నినాదంతో ప్రవహించే "జల్దానది" నదీపాతం. ఆ వెనుక ఒరిస్సాసరిహద్దు. లోయకు అటు 'అరకు' ఇటు 'సుంకరమెట్ట' గ్రామాలు. అక్కడ శుక్ర ఆదివారాలలో జరిగే కొండ ప్రజల సంతలూ. ఈ సంతల్లో ఇప్పటికీ మారకం పద్ధతిని జరిగే విక్రయ పద్ధతులూ, ఆ సంతల్లోనే నిర్ణయింపబడే కొండవారి పెళ్ళిళ్ళ పద్ధతులూ ఇవన్నీ చూడతగ్గవే; వర్ణించలేం! ఈ సుందర దృశ్యాలు అపురూప వనస్పతులూ చూడ్డానికి ప్రతిసంవత్సరం అనేకమంది టూరిస్టులు. కాలేజీ విద్యార్థులు, ముఖ్యంగా వృక్షశాఖవారు వచ్చి విడిచి వెళ్ళలేక వెళ్ళలేక వెళుతూ మళ్ళీ మళ్ళీ రావాలని ఉబలాట పడుతూంటారు. ఇక్కడ లభించిన "సీటం" అనే ఒక ఒషధిజీవిత చరిత్రపై పరిశోధనలు గావించి ఒకరు విశ్వవిద్యాలయ డిగ్రీ సంపాదించేరు.

అరకుకు 50 మైళ్ళ దూరంలో ఆంధ్ర దేశంలో నున్న ఏకైక జల విద్యుత్పత్తిస్థానమైన మాచ్

*********************

శ్రీమతి కె. సుగుణమణి

*********************

ఖండ్ ఉంది అక్కడ సుమారు 550 అ॥ ఎత్తు నుండిపడే జలపాతంఉంది. మరొక 20 మైళ్ళలో జయపూర్ సంస్థానం ఉంది.

8. వసతి, తదితర సౌకర్యాలు ఉండాలి. ప్రభుత్వశాఖలు, ముఖ్యంగా వ్యవసాయ, ప్రజారోగ్యం, వైద్యం, రెవెన్యూ, విద్యుచ్ఛక్తి, రోడ్లరవాణా, కమ్యూనిటీ డెవలప్‌మెంటు, స్త్రీ జనాభ్యుదయం వగైరాల శాఖల కృషిఫలితంగా అరకువేలీ యిప్పుడు శానిటోరియంగా మారిందని చెప్పొచ్చు. క్రొత్త క్రొత్త పంటలు, పళ్ళూ పండిస్తున్నారు. కాఫీతోటలు వేస్తున్నారు. కూరలు పళ్లూ పాలూ లభిస్తున్నాయి. బసకు బంగాళాలు, భోజనానికి హోటళ్ళు. నీటి సరఫరా, రోగులకు ఆస్పత్రి, అన్ని సరుకులూ అమ్మే కో-అపరేటివ్ స్టోర్లు, అన్నీ ఉన్నాయి. టౌనుప్లానింగు ప్రవీణుడువేసిన పథకం ప్రకారం పట్టణ నిర్మాణానికి దోహదమేర్పడుతూయుంది.

అరకులోయలో అమాయకులైన గిరిజనులున్నారు. వీరికివ్యవసాయం ముఖ్యవృత్తి. వేటకు వెళతారు డబ్బువిలువ మొన్న మొన్నటి వరకు వీరికి తెలియదనే చెప్పొచ్చు. సంతల్లో మారకం పద్ధతి ఉండేది; ఒక కుంచెడు ఆవాలిచ్చి కుంచెడు ఉప్పు తీసుకునే అమాయకులు! ఇప్పుడు కొంచెం నయమనుకోండి అడ్డాకులు ఆవాలు, కరక్కాయలు చింతపండు, చోళ్లు వలిసెలు, అల్లం విక్రయిస్తుంటారు ఒరియా- తెలుగు మాట్లాడతారు. పర్వదినాల్లో 'దిమిసా' అనేనాట్యం (స్త్రీపురుషులు కలిసి) తమాషాగా చేస్తారు. దిగువనుంచి వచ్చిన వార్ని అమ్మా-బాబు అని ఆదరిస్తారు. స్త్రీజనాభ్యుదయ శాఖతోసహా, వీరి సర్వతో ముఖాభివృద్ధికి కృషి జరుగుతూంది ఇటీవల పంచాయితీలు కూడ యేర్పడ్డాయి ఇంకా వేసవి విడిదికి విస్తారంగా ప్రజలు, ప్రభుత్వోద్యోగులు. వెళుతుంటే వీరికి కొంత ఆర్థికంగాను, నాగరికత అభి

తోలు అక్కడి వాణిజ్యం, ఖనిజసంపద, అటవీ సంపద, గనులు గిరిజనులు వగైరాల కన్నిటికీ తోడ్పడ్డానికి రైలు మార్గం కూడ అతి ముఖ్యం గనుక కొత్తవలస స్టేషన్‌ను జంక్షన్‌గా చేసి శృంగవరపు కోట మీదుగా అరకులోయలో నుండి బలాడిల్లాకు రైలు మార్గం మొత్తం 270 మైళ్లది నిర్మాణ మౌతూంది. దండకారణ్యంలో- బోలంగిరి కిరి బురప్రాంతా లన్నీ లుకస్తాయి. ఈ రైలు మార్గానికి 45కోట్ల రూ-లు ఖర్చవుతుంది. దీనివల్ల ముఖ్యంగా జపానుకు మన ఇనుపఖనిజం విశాఖ పట్నం రేవునుంచి ఎగుమతి అవుతుంది 1966వ సం1॥ రానికి రైలు మార్గ పనిపూర్తి అవుతుంది. అసంఖ్యాకగిరులు దుర్గమారణ్యాలు దాటాలిగనుక సుమారు 36 కొండలు దొలిచి గుహల్లోనుంచి రైలు వేస్తున్నారు. ఇదిగొప్ప ఇంజనీరింగు ఫీట నేచెప్పాలి. దీన్నివల్ల ఆంధ్రప్రదేశ్‌కు, ఒరిస్సాకు మధ్యప్రదేశ్‌కు కూడ లాభం.

అసలు ఆదిలో ఈ అరకులోయ ప్రణాళికకూ మాచ్‌కండ్ ప్రాజెక్టు నిర్మాణానికీ కారకులు అప్పటి ప్రభుత్వ ఎడ్వయిజరు కీ॥ శే॥ శ్రీ శొంఠి వేంకట రామమూర్తి పంతులుగారు. వ్యవసాయశాఖ డైరెక్టరు శ్రీ భాగవతుల విశ్వనాథం గారు. ఇప్పటికీ అరకుకోలనీని 'రామ్‌నగర్' అని కొండ ప్రజలు వ్యవహరిస్తుంటారు. ఇది "ఆంధ్రుల-ఊటీ" ఔతుందని అంతా అనుకున్నారు. ఇంకా అనుకుంటున్నారు. ఔతుదింకూడాను. ఈ ఏజన్సీ ప్రాంతాల సర్వతోముఖాభివృద్ధికి సహృదయులంతా పూనుకుంటేను.

ఆంధ్రప్రదేశ్‌లో ఈ కొండ ప్రాంతాల విస్తీర్ణం, రమారమి మైసూరంత ఉంది. "ఆంధ్రుల లక్ష్మి ఇక్కడ మళకాసురుడనే రాక్షసుడి వల్ల బంధింప బడియుండేది." దీన్ని పునరుద్ధరించుకుంటూ మనకు దైవం ప్రసాదించిన ప్రకృతి సంపదల్నీ, గిరుల్నీ- గిరిజనుల్నీ కూడకట్టుకుంటూ అంతా కలిసికట్టుగా కృషిచేస్తే ఆంధ్రులుఅన్నిట

★

# డైరీ

★



నవనాగరికురాలు. విద్యావతి, ధనికుని ఏకైకపుత్రిక అయిన రేణుక అత్తవారి మీద, భర్త మీద అలిగి తండ్రియింటికొచ్చింది. ఆ కోపోద్ధృతంలో మరణించిన తన తల్లి డైరీ చదవడం సంభవిస్తుంది. ఆ డైరీలోని విషయాలు రేణుక హృదయాన్ని కదిలిస్తాయా? ఆమెలోని మంకు తనాన్ని రూపు మాపుతాయా? ఇక చదవండి.

అంతటి విలువగల సంగతులేం వున్నాయో! ఆడైరీలో ఏ వుంటాయి? అమ్మ అమూల్యమైన ఆదేశాలను ఆమె పవిత్ర హస్తాలతో ఆ చిన్న డైరీలో. అక్షర రూపాల్ని రూపొందించి వుంటుంది

భక్తిగా ఆ పుస్తకాన్ని ఒకసారి కళ్ళ కద్దుకుని తడిపడ్డ రెప్పల్ని మధ్య మధ్య ఆర్చుకుంటూ, డైరీ పైన రుమాల్ని వొదిలించి పేజీలను చూడబోతూన్న రేణుకకు ఒకచిన్న సందేహం కల్గింది

ఒకరి జీవితానికి చెందిన ముఖ్య ఘట్టాలను విశదీకరించేటటువంటి డైరీని మరొకరు చదవడం ధర్మం కాదేమో? అయుండవచ్చును అయితే అమ్మమాత్రం నేను దీన్ని చదివి సంగతులను అవగాహన చేసుకుందు కనే ఇక్కడ పెట్టివుంచి వుంటుంది. అనుకుని డైరీలోని పేజీలను తిరగేస్తూ ముఖ్యమైన వాట్లను చదువ నారంభించింది రేణుక.

20-3-1938 ఇవాళ నా భర్తగారితో తొలిపరిచయం చేసుకునే రోజుగనక. నా భవిష్యత్తు ఎలా సాగుతుందో ఇకమీద తెలియాలి

అంటే నా పుట్టుకకు నాలుగు సంవత్సరాలు ముందరన్నమాట అనుకుంటూ మళ్ళీ కొన్ని పేజీలను తిరగేసింది.

4-6-40 ఈ ప్రపంచకంలో ఎందరెందరో. ఆడపిల్లలు పుడుతున్నారు పెరిగి పెద్దవారై అత్తవారిళ్ళకువెళ్ళి హాయిగా వుంటున్నారు అయితే నావంటి నిర్భాగ్యురాలు మాత్రం నేను తప్ప ఇంకెవ్వరూ వుండరు నా జీవితంలో ఎన్ని కష్టాలు! ఎంతనిశ్ప్రృహ భూమిమీద పడగానే తల్లిని పోగొట్టుకున్నాను మారు తల్లివల్ల మనుషులు పడలేని బాధలెన్నో పడ్డాను. ఏదో నాన్న పెద్దమనసుచేసి మంచిచోట నన్నిస్తున్నారు. ఇక నా కష్టాలు గట్టెక్కుతాయి అనుకున్నానుగాని, మునపటికన్నా అధోగతిని పడుతున్నాననుకోలేదు

అమ్మ జీవితంలో అంతకష్ట పడిందా? అలా పైకెన్నడూ కనిపించుకోలేదే, అమ్మ? మళ్ళీ కొన్ని పేజీలను తిరగవేసింది.

16-7-41 రోజులు గడుస్తున్నకొద్దీ, ఎన్నెన్నిదుర్భర సన్నివేశాలూ! ఇంట్లో అందరికీ నేనంటే ఎంతలోకువ

భగవాన్! ఎన్నాళ్ళీ నరకం! కష్టాలకోసరం నేనూ నా కోసరం కష్టాలూ పుట్టాయా? లేకపోతే ఎందుకు నాకీ శిక్ష? కాస్సేపు కళ్ళు రెండూ గట్టిగా మూసుకుని తల్లి ఇబ్బందుల్ని తనలో చిత్రించి చూసుకుని నిట్టూర్చింది రేణుక.

5-2-42 భగవంతుడు దయామయుడు నిరపరాధి నైన నా మొర ఆలకించి కరుణించాడు. నా జీవితం లోని చీకట్లను పటాపంచెలు చేసేందుకేమో అన్నట్లు నీడనీడగా వెల్గు గోచరిస్తూంది. నా అదృష్టంబాగుండి ఆ వెల్గు దినదినాభి వృద్ధిపొంది త్వరగా ప్రకాశవంతం కావాలి

9-2-42 నేను ఎదురుచూస్తున్న అదృష్టాన్ని దైవం నిజంగానే ప్రసాదించాడు. కొద్ది రోజుల్నుంచే నాకది ప్రత్యక్షంగానే అవగాహన అవుతూంది. అంతే ఇంట్లో అందరూ నన్ను అతిగారాబంగా చూస్తున్నారు అందుక్కారణం నానుండివారు ఎగురుచూస్తూన్న ఆనందం వేరయినా మొత్తానికి నాకు సుఖంగా ఆనం దంగా రోజులు గడిచిపోతున్నాయన్నమాటే. ఇంతే కాదు. ఇకమీద నా కంతా సుఖమే అంతాఆనందమే

2-3-43 అమ్మయ్య! రోజులూ వారాలూ నెలలు గడిచి మేమంతా ఎదురు చూస్తున్న శుభసమయం త్వరలోనే ఆసన్నమవబోతూంది ప్రభూ సునాయా సంగా నన్నీ ఆపదనుండి దాటించు.

10-8-43 నాశ్రమ ఫలించింది. నా పూజలు ఫలిం చేయి. అందువల్లనే భగవంతుడు నేనుకోరుకున్నటువంటి మూర్తినే నాకు ప్రసాదించాడు. నా ముద్దుబిడ్డ నా అందాల భరిణ. నా అదృష్టరేఖ నా జీవిత సర్వస్వం అవతరించింది నాకింకేం తక్కువ? ఒహో! నా పుట్టుకను గురించే అమ్మ ఇంతగా వర్ణిస్తా అనుకుంటూ మళ్ళీ పేజీల్ను తిరగేసింది.

11-2-44 ఆనందం ఇంట్లోఎటుచూసినా ఆనందం. ఇంతచక్కని బిడ్డనుకని తనకిచ్చినందుకుగాను వారు నన్నెంతగా అభినందించి ఆదరిస్తున్నారూ. అత్తా, ఆడ బిడ్డలూ నన్నూ నా ఆరోగ్యాన్ని ఎంతజాగ్ర త్తగా కాపాడుతున్నారు. ఓర్చినమ్మకు తేటనీరూ అన్నట్టు ఎన్నిసార్లు మనస్సెంత బాధపడి అగాయి త్యాలకు తలపడబోయినా అందుకులోబడక సహ జంగా సర్దుకుంటూ కాలక్షేపం చేసుకొచ్చానుగనకనే ఇప్పుడీ అదృష్టాన్ని అందుకోగల్గాను. అనుభవనీయమైన అమ్మ ఆదేశానికి నా ప్రవర్తన వ్యతిరేకమే అవుతుందేమో. కాస్సేపు ఆలోచనగా పైకిచూసి మళ్ళీ పేజీలు తిరగేసింది.

4-6-45 ఎంత అన్యాయం? నిజంగా నా వంటి దురదృష్టవంతురాలు ఈ ప్రపంచంలో మరొకర్తె వుండదు. లేకపోతే పాలుగారుతున్న నాచిన్న తల్లి పాలబుగ్గల్ను ముద్దు పెట్టుకుందుక్కూడా వీలు లే కండా నా బంగారు తల్లిని నా చేతులమీద అల్లారు ముద్దుగా పెంచుకుందుక్కూడా లేకండా ఇటువంటి పాడువ్యాధి నాకు పట్టుకుంటుందా! అబ్బా అయితే కొన్నాళ్ళపాటు అమ్మమంచాన్నుందన్నమాట.

నిజమమ్మా! నువ్వనుకున్నది ముమ్మాటికీ నిజం నువ్వు మరుగు పడిపోయి ఎన్నో సంవత్సరాలయి పోయినా, నీ కీర్తి మాత్రం అందరి హృదయాల్లోనూ అలా మెరుగు మాయకండా ప్రకాసిస్తూనేవుందమ్మా నిజంగా నువ్వెంతో అదృష్టవంతురాలవమ్మా-బాధగా కాస్సేపు కళ్లుమూసుకుంది రేణుక

2-10-45 అయ్యో, నే నింకా ఎంత కాలం ఇలా పడుండాలి? మనసులో ఏదో చెప్పలేని వేదన. నరాల్లో భరించరాని బాధ. సంవత్సరాలు దొర్లి పోతున్నాయి గాని, ఎంతవైద్యం చేయించినా గుణంసూన్యం,

నేను అనాది నుండే అంతగా కష్టపడటం నా మంచికే అయింది అందు ఫలితంగా నాలోస్థిరపడ్డ నిదానమే నన్నందరికీ మంచి దాన్నిగా చేసింది ఇటు పుట్టినింటికి అటు మెట్టినింటికీ నావల్ల ఏచిన్న అపఖ్యాతి రాకుండా ఈ జీవితంలో నా విధిని నేను చక్కగానే నిర్వహించి నట్టు అందరూ నన్ను మెచ్చుకున్నారు ఈ ఒక్క తృప్తి చాల్ను నేను ప్రశాంత హృద యంతో కళ్లుముయ్యడానికి.

కీడులో మేలన్నట్టు. నా ఆరోగ్యం ఎంత అన్యా యంగా వున్నా నాపాప అదృష్టం కొద్దీ అంతమంచి మనిషైన లక్ష్మమ్మ ఆయాగా దొరికింది గనుక పాప చక్కగా పెరుగుతూంది.

6-2-49. అబ్బ! వారికి పాపంటే ఎంతప్రేమ? ఎంత ప్రాణం? అదిచూస్తున్న కొద్దీ, నాకేదో చెప్పరాని వేదన. ఈ విపరీతపు అభిమానం నా బిడ్డ భవిష్యత్తుని

శ్రీమతి గుళ్లపల్లి సుందరమ్మ

బాధిస్తుందేమోనని. ఏదో భ్రమ వెర్రి భయం! వారికి నా బెంగ, నాకు పాపబెంగ.

"అమ్మ తల్చింది నిజవేనేమో, లేకపోతే నా ప్రవర్తన చూశాక అందరూ ఇప్పుడదే మాట ఎందు కంటారూ ఆఖరికి మొన్న మా అత్తవారింట్లో వాళ్లంతా కూడా నా మొండితనం పట్టుదలా చూసి అదేగా అన్నారు

4–8–50 నాబిడ్డ అమిత అందగత్తె. కాస్త పట్టుదలా ముక్కోపంవున్నా. అతి చురుకైనది పాప మాటలూ పాటలు నేర్చి బడికివెళ్తూంది నాశరీరంలో అస్వస్తత హెచ్చింది నడుము పట్టుతప్పింది కొంచెం సేపుకూర్చో లేని పరిస్తితి ఏర్పడింది. అయ్యో చిన్నపిల్లల్ను ఆశ పెట్టి మోసగించినట్టు దైవం నన్నిలా సిక్షిస్తున్నాడే? ఇక నా బిడ్డకు మంచి చెడ్డలు మప్పి ఉత్తమమైన మార్గాన్ని పెట్టి. అందరికన్నా ఆదర్శనీయురాలిగా ఎలా తయారు చెయ్యడం? భగవంతుడా! నా ఈ కోరిక నాలోనే జీర్ణమై పోవాలన్నదే నీ తీర్మానమా? ఓ భగవాన్ కష్టాలు పడలేక నేను. చావాలను కున్న రోజుల్లో బతికేతీరాలని కొత్త ఆశలు చూపిస్తూ నన్ను శాశించావ్. ఇప్పుడు ఆశచూపిన అదృష్ట మంతా నాకబ్బిన తరువాత తీసుకు పోతాను రమ్మంటావేం? నాకు చావువొద్దు తండ్రీ బతుకునియ్యి ఇలా మంచాన్న వున్డైనా కళ్లతో చూసైనా కొన్నాళ్ల పాటు నన్ను బతకనియ్యి ఇంతలో తీసుకుపోకు.

"అమ్మో మౌనంగా మంచమ్మీదపడుక్కుని వుండే నీలో ఇంతటి హాలాహలం దిగమింగు కుంటున్నా వన్నది. ఆ రోజుల్లో ఎన్నడూ నేను తెల్సుకో లేక పోయానమ్మా!" అంటూ జారుతూన్న కన్నీటిని తుడుచుకుని మళ్లీ డైరీ విప్పింది

2–6–52. వేలకువేలూ నావైద్యానికి వినియోగి స్తున్నారుగాని ఫలితం శూన్యం, మళ్లీ ఇంట్లో అశాంతి అందరికీ మనోవ్యథ వ్యాపారంలో దినదినాభి వృద్ధి పొంది ఇప్పుడు వారుపట్టినదల్లా బంగారవుమతూంది నన్నెంతో సుఖపెట్టాలనే వారికోరిక కూడా అయితే నా దురదృష్టానికి వారేంచేస్తారు ఎవరు మాత్రం ఏంచేస్తారు.

5–4–56 వారి అపురూపపు పెంపకాన్ని గురించి నేను తల్చింది భ్రమ కాదు, అందు ఫలితంగా. పాప వయస్సుతో పాటు అందంకన్నా పదిరెట్లు ఎక్కువగా దురలవాట్లు పెరుగు తున్నాయి. ఇంత జబ్బులో నే నుంటే ఒక్క సారైనా "అమ్మ ఏలావుంది" అని నన్నడగదు సరికదా నే పిల్చినాకూడా దగ్గరకురాదు అసలు తల్లి అన్న దృష్టే నా యందు పాపకు లేదు. పైగా అందరిమీదా ఆ అధికారాలూ ఆ అహంభావం నా పాపకు నవవగాసాలూ నా గర్భంలో వున్న నా పాపకు ఇంత తలబిరుసు ఎలా ఒచ్చిందో?

ఇంకా ఉపేక్షచెయ్యడం మంచిది గాదని వారిని విడిగాపిల్చి అన్ని వివరంగా చెప్పాను ఇంత అసంద ర్భంగా పెంచితె రేపొద్దున్న ఆ అత్తవారెంత మంచి వాళ్లయినా కూడా నిర్వహించు కోవడం కష్టం ఇప్పటికైనా దాన్ని సన్మార్గాన్న పెట్టేందుకు ప్రయ త్నించండి అని ఎంత బోధించాను అసలే అనారోగ్యంగా వున్న నామాటను కాదన లేక అన్నింటికూ ఊఁకొ తలవూపారే గాని ఆచరణలో మాత్రం పెట్టలేదు. కారణం పాపపైన ఆయనకుండే మమకారం పాప చిన్నబుచ్చు కుంటుందేమో నన్న భయం.

రోషంతో రేణుక ముఖం ఎర్రబడింది.

9–12–57. అబ్బా ఈ పాపకెంతనోరు దురుసుతనం, అందరియందూ ఎంత నిరసన. భగవంతుడా ఇందు ఫలితంగా మునుముందుదాని అత్తవారివల్ల నే నెంత హైన్యపడవలసి వుంటుందో? ప్రభూ అను భవించిన ఆనందం చాలునుగాని అలాంటి సంఘటన్లు కలుగక ముందే నా కాలాన్ని కడతేర్చు.

5–4–58. పరాత్పరుడు నామొర ఆలకించాడు అవును. నేను భయపడ్డ ఆ సంఘటన్లు ఏవీ సంప్రాప్తం కాకముందే నాకాల ఆ సన్నమయేటట్టు నన్నను గ్రహించాడు.

"అబ్బా?" అంటూబాధగానిట్టూర్చింది రేణుక

8–11–58 నా కాలం తీరుతూంది త్వరలో బండి గమ్యాన్ని చేరిపోతుందను కుంటాను. ఓ భగవాన్ తెలిసి తెలియక నేను చేసిన అపరాధా లేవన్నా వుంటే క్షమించి నా కోరికను పాలించు. ఈ జన్మలో నేను ఏదన్నా పాపం చేసుంటే అందుకైన శిక్ష నాకు విధించి నా సకృతాలకు ఫలితంగా మాత్రం నాబిడ్డకు మంచిబుద్ధినిచ్చి, ఆదరించు. ఇదే నా అంత్యకాలంలో ఆఖరుసారిగా నిన్ను నేకోరేకోరిక. వేళ్లు కొంకర్లు పోతున్నాయి. శరీరం దుర్బలంగావుంది. కళ్లు మసగ పడుతున్నాయి ఇంక ఒక్క అక్షరమన్నా రాయలేను.

"అమ్మా నేను మహాపాపాత్మురాల్ని. నీ కడుపున చెడబుట్టాను నిజంగా నా బెంగవల్లనే నువ్విలాఆకాల మృత్యువాత బడ్డావు ... అమ్మా ఒక్కసంగతి. ఈ డైరీయే నీ పాదాలుగా తల్చి దీన్నితాకి ప్రమాణం చేస్తున్నాను. ఈ నిమిషంనుండే నాపైన నువ్వుపెట్టు ఆశలన్నీ సార్థకం చేశేందుకు ప్రయత్నిస్తాను ముమ్మాటికీ ప్రయత్నిస్తాను. నా మాటనమ్ముఅంటూ వెర్రిగా పైకే కేకలు పెట్టింది రేణుక.

అంతవరకూ కింద ఏదో పన్లు చక్కబెట్టుకుని పైకి వొస్తున్న ఆయాకి రేణుక పెట్టిన ఈ కేకలు అరాకొరగా వినిపించగానే "పగటి నిద్రలోనే పలవరిస్తున్నదేమో అనుకుని పరుగెత్తుకుంటూ వొచ్చింది. అయితే ఆక్కడ గుండెలకు డైరీని హత్తుకుని కన్నీరు కారుస్తున్న రేణుకను చూడగానే క్షణంలోసంగతంతా గ్రహించి "లే తల్లీ లేచి అమ్మ పఠానికి ధండంపెట్టు ఆమె ఆశీర్వాదం పొందావంటే ఇకనీకు లోపమంటూ వుండదు. లే మరి? అంటూ రేణుక కళ్ళూ మొహం తుడిచి మార్చుకుందుకు బట్టలిచ్చింది ఆయా

ఏమనుకుందో ఏమో అతి త్వరగా ముస్తాబై దబదబా కిందికెళ్ళింది రేణుక హాల్లో కాలుగాలిన పిల్లిలా పచార్లు చేస్తూన్న శర్మగారు కూతురింత హెచ్చరికగా దిగిరావడం తనతో ఏదో అనబోయి సంకోచిస్తూ వుండడం. గమనించి అదివరకూ తెలియని మార్పేదో ఆమెలో కన్పించినట్టు సావధానంగా రేణుక మొహంలోకి చూశారు

"అలా చూస్తున్నారేం నాన్నా" అందిసిగ్గుగా రేణుక

"ఏమీ లేదమ్మా" అన్నారు నిస్పృహగా.

"చెప్పునాన్నా?" అంటూ చనువుగా ఆయనపక్కనే కూర్చుని చొక్కా బొత్తాముల్ని సవరిస్తూ

"ఏంలేదమ్మా! ఇన్నాళ్ళూ తెలియని మీ అమ్మ ఛాయలు ఎన్నో ఇవాళకొత్తగా నీ ముఖంలో నాక్కనిపిస్తున్నాయి ఆ చూపుల్లో వాత్సల్యం, కళ్ళల్లో వర్చస్సూ ముఖంలో సాత్వికం అన్నీ మూడుమూర్తులా మీ అమ్మ లక్షణాలేనమ్మా" చెమ్మగిల్లిన కళ్ళతో ప్రేమగా కూతురి తలనిమురుతూ అన్నారు

ఏమిటి అహంభావం పుట్టిపడుతూండే నా మొహంలో ఇవాళ అమ్మ జాడలు కొత్తగా కనిపిస్తున్నాయంటే నిజంగా అది నాలో కల్గిన పరివర్తనా కారణంగానే అయ్యుండాలి. ఇందుకే గావల్ను ముఖాన్ని హృదయానికి అద్దం వంటిదన్నారు.

"ఇవాళ నీలో ఇంతగా మీ అమ్మజాడలు తోచాయంటే నిజంగా అది మనకు శుభసూచకమేనమ్మా! అన్నట్టు అరగంట కావచ్చింది. అల్లుడికి ఫోనుచేసి ఇంకా ఊడిపడడేం" అన్నారు కాస్తకోపంగా.

"వారికేంపనో ఎందుకులే నాన్నా. నేనెవెళతా" అంది. అవసరంగాలేస్తూ రేణుక.

"ఏవిటీ నువ్వా! ఇప్పుడే వెళ్తావా? అన్నారు అతిగా ఆశ్చర్యపోతూ శర్మగారు.

"ఆడపిల్లలంటే మరేం అనుకున్నారు బాబూ!" అంది. అర్థంగా నవ్వుతూ ఆయా.

"నాకు తెలుసు. ఎప్పుడైతే నీలో మీ అమ్మజాడలు కల్గాయో అప్పుడే నీ మనసుక్కూడా ఆవిడ ఆదే శాలవంటివి అలవడే వుంటాయని. కాకపోయినా. అసలు కారణం ఏమిటో తెల్సుకోకుండా నీ మాట ఆధారం చేసుకుని వాళ్ళతో నిష్టుర పడబోవడం నాదే తప్పు ఇంకానయం ఇప్పుడన్నా ఆ పొరపాటు తెల్సుకున్నాను "

"ఆఁ కారణం ఏంవుంటుంది బాబూ వడ్లగింజలో బియ్యపుగింజ అంతే అది సరేగాని అయిన ఆలశ్యం అవనే అయిందిగనక అల్లుడయ్యా వొచ్చాక భోజనం చేసుకునే వెళ్ళరాదుటమ్మా రేణుకమ్మా!" అంది ఆయా.

"అబ్బ నాకేమీవొద్దు" విసుక్కుంటూ చేతిసంచితో సహా పోర్టికో వేపు నడించింది.

"అమ్మాయి సంగతి ఎరిగుండీ ఎందుకడుగుతావ్ లక్ష్మమ్మా. లేచి నిల్చుందంటే ఇక కళ్ళెంతెగిన గుర్రమేగా అదీ!" నవ్వుకుంటూ తనూ లేచి కారువద్దకు వెళ్ళారు

తోటలో ఫలించిన పళ్లూ పువ్వులూ బుట్టనిండా పోసి రేణుక పక్కన వుంచిన ఆయా రేణుకచెవులో

ఏదో చెప్పి దృష్టి పరిహారంగా ఆమె చెక్కిళ్ళనుఊడ్చి తన మొహంమ్మీద మెటికెలు విరుచుకుంది

"వెళ్లొస్తా అయా!" అంటూ ఎంతో ఉత్సాహంగా బయల్దేరిన రేణుకకు అంతలోనే మనసులో ఒక కొత్త సమస్య బయల్దేరింది తగుదునమ్మా అంటూ నాన్నను తొందరపెట్టేసి బయల్దేరానే గాని. పొద్దున్న నేనక్కడ చేసొచ్చిన రాద్ధాంతానికి ఇప్పుడేవిధంగా దాన్ని సమర్థించుకోవాలో ఆలోచించుకోనే లేదే?" మిగతా ఎవరిమాట ఎలావున్నా అమృత సెలి వంటి తనపెద్దత్తగార్ని ఏ మొహం పెట్టుకు చూడ్డం? సరదాగా శ్రీధర్ ని మళ్లీ ఎలాగ పల్కరించడం? కోపం కొద్దీ అప్పుడందరిమీదా కల్లుతాగిన కోతిలాగ గెంతడం వంటే గెంతేను గాని ఇప్పుడు సరిదిద్దుకోవడవంటే సామాన్యమా? మరీ రేణుక ఇలా తర్కించుకుంటూ వుండగానే కారు శ్రీధర్ ఇంటి ముందు ఆగింది.

"ఇప్పుడు నేను ఇంట్లోపలకి రావడం అంత సమంజసంగావుండదమ్మా మరో నాడు వస్తాలే" అంటూ రామశర్మ గారువెళ్లిపోయారు.

వంగిన తలఎత్తకండా పీచుపీచు మంటున్న ప్రాణాల్తో మెల్లగా లోపల కొచ్చిన రేణుకను. "వచ్చావా తల్లి రా! నీకోసరమే బయల్దేరబోతున్నా" అంది ఎంతో ఆప్యాయంగా రేణుక పెద్దత్తగారు

"అమ్మయ్య నువ్వొచ్చేశావా! బతికాను! పొద్దుట్నుంచీ కటిక ఉపవాసంతో వుందా కొండంత వరలక్ష్మి వ్రతం ఇంటికైన కోడలికి పసుపుకుంకం ఇవ్వకండానా! అంటూ ఇప్పుడు నీ కోసరం అన్నీ పట్టుకుని బయల్దేరుతూంది ఓపక్క తూలిపోతూనూ!" అంది రేణుక పెద్దాడబిడ్డ.

"అవునే మరీ ఇంట్లో ఎంతమంది వున్నా ఎవరినిందు వారిదేనూ! ఈ రంగు శ్రీధర్ కి ఇష్టమని ప్రత్యేకం ఎంచి కొనితెచ్చాను మరి తెచ్చినందుకు అది కట్టుకు? వాడు చూసి ఆనందించకండా నా!" అంటూ చీరెతో సహా పళ్లెం నిండా పళ్లూపసుపూ పెట్టి రేణుకకు అందించింది పెద్దత్తగారు.

అతివినయంగా పళ్లాన్నందుకుని పక్కగా పెట్టి తనతల ఆమె పాదాలకాన్చి నమస్కరించింది రేణుక మనసులో గురికుదురి నందున పండి పోయిన ఆమె పచ్చనిపాదాల్ను వదలబుద్ధి కాలేదు రేణుకకు.

రేణుక తనంతట తనేరావడం పెద్దవార్ని మన్నించి నమస్కరించడం ఇందుకే ఇంట్లోవాళ్ళంతా ఆశ్చర్యపోతూంటే అంతకన్నా ఆశ్చర్యం కల్గించేలాగ ఆ కొత్త చీరెను కట్టుకుని సామాన్లగదిలోనుంచి వొచ్చి అగాత్తరికి నమస్కరించ బోయింది రేణుక.

"ఆ ఆ ఆగవే పిచ్చి పిల్లా ఆగు వెళ్ళి మావాణ్ణి పిల్చుకురామరి ఇద్దరూ కలిసి దండం పెడుదురుగాని" అంటూ రేణుకను పైకి తరిమింది.

వొణుకుతున్న కాళ్ళతో తడబడుతూ మేడ మెట్లుక్కుతూన్న రేణుకని "ఎవరో వొస్తున్నారు చూడరా శ్రీధర్" అన్న పెదతల్లి పిలుపువిని దబదబా మెట్లవరకూ వచ్చిన శ్రీధర్ ఆప్యాయంగా భార్యకి చేయి అందించి తీసుకు వెళ్ళాడు. కొత్త పరిచెయంలాగ ముచ్చెమటలు పోశాయి రేణుకకు.

"ఇంత తర్వగా ఇంత సాత్వీకం నీకెలా వచ్చింది రేణూ? అన్నాడు" రేణుకధోరణిచూసి ఆశ్చర్యపోతూ శ్రీధర్. రేణుక ఏమీ మాట్లాడలేదు

"అరెరే! ఆకాశమంతా కారు చీకట్లుగమ్మి ఉరుములూ మెరుపులూ! ఎంత పెద్దతుఫాను పట్టుతుందోనని హడలిపోతూంటే చివరకు ఒక్క చినుకన్నా పడకండా చప్పగా తేలిపోయిందే?" అన్నాడు కొంటెతనంగా రేణుకవైపు చూస్తూ, రేణుకని అల్లరిపెట్టి రెచ్చగొట్టడం అంటే శ్రీధర్ కి అమితసరదా!

"అయితే నాలో ఎప్పటికైనా ఇలాంటిమార్పు వస్తుందేమోనని కూడా ఎదురు చూడలేదన్న మాట మీరు"

"అందుకే కదుటోయ్? ఇంతాశ్చర్యం? నిజంగా ఇంతత్వరలో ఇంతటి పరివర్తన ఎలాకల్గింది చెప్పవూ" తలనిమురుతూ లాలనగా అడిగాడు

'మా అమ్మ పుణ్యాన్న.

"అంటే?" ఆలోచనగా అన్నాడు

"అంటే ఇందులో లిఖించబడ్డ రత్నాలవంటి ఆమె ఆదేశాల వల్ల" అంటూ ఆఅమూల్యామైన డైరీ నితీసి అతని కందించింది రేణుక

"అలాగయితే దీన్ని దేవతా మందిరంలో వుంచి ఆజన్మాంతం మనమిద్దరం పూజించుకుందాం రేణూ!" అంటూ డైరీతో సహా రేణుకచేతిని కూడా అందుకుని దగ్గర తీసుకున్నాడు శ్రీధర్.

# కవితాతిలక సరోజినీదేవి

## పి. శివరాం

భారతదేశం కళానియం, అట్టి కళలయందు కవిత్వ మహా ప్రసిద్ధిగాంచినది. భారతీయులు మరీ గర్వపడవలసిన విషయం భారతీయులలో పెక్కుమంది కవయిత్రుల కూడా ఆలవాలమై యుండుటయే.

అట్టి కవితామ తల్లులలో సరోజినీ నాయుడు ప్రఖ్యాతి గాంచినది. ఈమె ఆంగ్లములో పద్యరచన సల్పి భారత దేశము నకు పాశ్చాత్య దేశములలో తరగని కీర్తి సాధించినది.

ఈమె జననం ఫిబ్రవరి 13 వ తేది 1879 సంవత్సరములో ప్రస్థుత ఆంధ్ర ప్రదేశ రాజధానీ నగరమైన హైదరాబాదు నందు జరిగినది. సరోజినీదేవి తండ్రి అఘూరనాథ చటోపాధ్యాయ బంగాలీ బ్రహ్మణ కుంబమునకు చెందిన వ్యక్తి గణనీయమైనవిద్యావేత్త.

సరోజినీ తన పండెండవ ఏట నే మెట్రిక్యులేషన్ పరీక్షయందు ఉత్తీర్ణురాలై తన విశ్వవిద్యాలయవిద్య లండనునందు కేంబ్రిజ్జి నందు చదివినది. ఈమెగణిత శాస్త్రజ్ఞురాలు కానీ, శాస్త్రజ్ఞురాలు కానీ కావాలని తండ్రి ఆశయమై యుండెడిది. దానికి భిన్నముగా ఈమె తనప్రజ్ఞ కవిత్వంలో సాధించెను.

1898 వత్సరములో విద్యాభ్యాసము పూర్తి చేసి స్వదేశమునకు తిరిగివచ్చి, జి. నాయుడు అను తండ్రిగారి శిష్యుడు విద్యాధికుడు అగు మదరాసీ యువకుని వివాహమాడెను.

సరోజినీదేవి కవిత్వము స్వల్పముగ చేసినను ఉన్నతస్థాయి నొంది. ప్రఖ్యాత ఆంగ్లవిమర్శకులైన 'శాంమ్‌సన్', గాస్‌ల మన్ననల నొందినది.

పద్యములు మృదు పదసంపుటికి, స్వాభావికతకుప్రసిద్ధిగాంచినవి. ప్రధాని నెహ్రూ ఆమెయే ఒక పద్యము అని (She herself is a poem) అన్నారు. అపూర్వమై ఊహాశక్తి ఉత్సాహము రేకెత్తించు పదజాల సృష్టి కలిగి ఈమె ప్రకాసించినది. ఈమె పదజాలము తేనెలు పారు నటులుండును కాబట్టి ఈమెకు "దినైటింగేల్ ఆఫ్ ఇండియా" (The Nightingle of India) అను పేరు వచ్చినది.

సరోజినీ నాయుడు అనారోగ్యముతోను హృద్రోగముతోను చాలాకాలము బాధపడినది సోల్‌ప్రేయర్ (Soul's Prayer) ఆంగ్ల పద్యములో తన జీవితములో కష్ట సుఖములను ఒకే విధముగా భరిస్తాను. నాకు సంపూర్ణమైన ఆనందముకానీ సంపూర్ణమైన విచారముకానీ వద్దు రెండు సమపాళ్ళలో నుండి జీవితమును తెలిసికోవాలని కోరుకుంటుంది. ఈ పద్యము వలన జీతముపై ఆమెకుగల వేదాంత దృష్టిస్పష్టమవుతుంది.

భారత దేశమును దాశ్య సృంఖలములనుండి విముక్తిగావించుటకు పాటుపడిన వీరవనిత, కవయిత్రి సరోజినీదేవి చిరస్మరణీయురాలు ఈ 1964 ఫిబ్రవరి 13వ తేది ఈ పూజ్య మాతను స్మరించుట యావద్భారతావని విధి. ఈమెయే జీవించియుండిన ప్రస్థుత క్లిష్ట పరిస్థితులలో స్త్రీల యొక్క కర్తవ్యమును గూర్చి ఎట్టి అపూర్వ సలహాల నొసంగి యుండెడిదోకదా! ★

# క్రొత్త శకం

## "సత్యం"

ఎవరు నువ్వు ?
మల్లెవంటి హృదయంలో
ముళ్ళపొదలు పెంచుకొంటున్నావెందుకు ?
సుఖలుచిలికే చిరునవ్వుల మాటున
కాలకూట హాలాహాలాలను
ఆప్యాయంగా పదిలపరచుకొంటున్నావెందుకు ?
ఎదురుగా ఎక్కడలేని స్నేహం ఒలికించి
వెనుకగా గోతులు త్రవ్వటం
హాబీగా ఆడుకొంటున్నా వెందుకు ?
పిడికిలికన్నా
చిన్నదైన గుండెలో
సప్తసముద్రాలకన్నా
విస్తీర్ణమైన ఆశను
కన్న బిడ్డలా సాకుతున్నావెందుకు ?

★ ★ ★

ఓహో ! నువ్వు మానవుడివా ?
ప్రకృతి మాత హృదయాన్ని
బదాబదలు చేసి
రహస్యాలన్నిటినీ
గుప్పెటలో పెట్టుకొన్న విజయుడివా ?
రాకెట్ల మీద షికారుగా
ఆకాశపుటంచుల్లో విహరిస్తున్న
అధునాతన నాగరికుడివా ?
'బుద్ధి' చేతుల్లో కీలుబొమ్మగా
అద్దెకు పని చేస్తున్న శోధకుడివా ?
భూనభోంతరాళాలలో
ఎదురులేదనే గర్వంతో
విర్రవీగుతున్న సర్వాంతర్యామివా ?
అయితే – మరి నీకు
ఈ విచారం ఎందుకు ?
ఇంతవాడివైనా
నీలో ఓ మూల
ఏదో తెలియని బాధ
జ్వాలాముఖిపర్వతంలా
రగులుతోంది – ఎందుకు ?

★ ★ ★

ఎందుకో నన్ను చెప్పమంటావా ?
నీలో సహృదయం లోపించినందుకు –
అందరిలో ఉన్న నిన్ను
నువ్వు గుర్తించనందుకు
సంకుచిత భావాల
యినుప గోడల మధ్య
మానవతను మరచిపోయినందుకు –
అహంభావపు త్రాళ్ళతో
నిన్ను నువ్వు బంధించుకొన్నందుకు –
అందుకే నీలో యీ అశాంతి
అందు కేనీలో
అప్పుడప్పుడు రగులుతుంది క్రాంతి !
ఇప్పటికైనా కళ్ళు తెరుచుకో
నీలోని హృదయం
సమభావ తంత్రులపై
మీటుతున్న శాంతిగీతిని
ఆలకించి, ఆచరించుకో
ఆనాడు నీకు శాంతి లభిస్తుంది
నీలోని యీ జ్వాల చల్లారుతుంది !
అందరిలో నువ్వు కన్పిస్తావు –
నీలో అందరూ కన్పిస్తారు –
ప్రపంచమంతా
ఒక్కటిగా తయారవుతుంది
నీ చరిత్రలో
క్రొత్తశకం ఆరంభమౌతుంది.

★

# ANDHRA MAHILA SABHA NURSING HOME

## STATISTICS FOR THE YEAR 1963

### OUT PATIENT DEPARTMENT :

| | |
|---|---|
| No. of Medical Cases Treated | 10,135 |
| „ „ Surgical „ „ | 442 |
| „ „ Ante-Natal „ „ | 3,310 |
| „ „ Post-Natal „ „ | 814 |
| „ „ Gynaec „ „ | 1,316 |
| „ „ E. E N T. „ „ | 492 |
| „ „ Dental „ „ | 72 |
| Total Number of New Patients Treated ... | 16,581 |
| „ „ „ Old „ „ ... | 23,655 |
| GRAND TOTAL | 40,236 |

### ADMISSION REGISTER

| | |
|---|---|
| No. of Patients Admitted for Normal Delivery | 1,604 |
| „ „ „ „ „ Abnormal „ Forceps - 97, Manual Removal of Placenta 6., I. P. Version 6. Breech Extraction 6 ., Face Presentation 2 Caeserian Section-1. | 118 |
| Ante-Natal with False Pains Treated. | 264 |
| „ „ Snte-Natal with Toxaemia | 39 |
| „ „ Post-natal Cases Treated | 37 |
| „ „ Gyneac Cases „ | 334 |
| „ „ Medical Cases „ | 296 |
| „ „ Surgical Cases „ | 30 |
| „ „ babies admitted as Lodgers | 1,748 |
| Grand Total | 4,470 |

**Operations**

| | | | |
|---|---|---|---|
| Cataract | 19 | Ovariotomy with Appendicectomy | 1 |
| Amputation of Cervix | 1 | Colpoperiniorraphy | 1 |
| Bartholin's Alxcess | 1 | Pterygum | 2 |
| | | Exchange Transfusions | 2 |
| Aspiration of Pheumothorax | 1 | Caesarean Section | *1 |
| | | Puerperal Sterlizations | *26 |

**K R Ambuja,**
*Signature of Resident Medical Officer*

**M Pavanabai,**
*Signature of Medical Superintendent.*

# శారదలేఖలు

సౌభాగ్యవతి కల్పలతకు
నెచ్చెలీ:

ఈ మధ్య నా వద్దకు ఒక యువతి వచ్చినది. ఆమెలోగడ మాయువతీ విద్యాలయమున చేరి కొన్నాళ్ళు చదివి అనారోగ్యము వలన చదువు విరమించుకొనిన విద్యార్థిని. ఆమె యెనిమిదవ తరగతి పరీక్షకు స్వయముగా కట్టుకొని పబ్లికు పరీక్షకు వెళ్లదలచి ఆ దరఖాస్తులు వగైరాలు ఎట్లు పంపుకొనవలయునో తెలియక తెలిసికొనవలెనని వచ్చినది. అయితే నీ జబ్బు ఏమయినదంటిని. నా కసలు ఆక్షయ సంబంధమైన జబ్బే కాదండి ఇదంతా మా వదిన పుట్టించినవాదు అన్నది. అయితే నీవు అత్తవారి యింటికే వెళ్ళవచ్చునుగా అన్నాను. అవును గాని ఆమెవాళ్ళకు ఈమాటే చెప్పినాకక్కడ స్థానం లేకుండా చేసినదని జొట జొట కన్నీరు కార్చినది. మీ అమ్మలేదా అంటిని ఉంటే నాకీ అగచాట్లు ఎందుకు వస్తాయండీ! అన్నది. నా కెంతో జాలి వేసినది పాపము తల్లి ఉంటే ఎన్ని కష్టాలు వచ్చినా కడుపులో పెట్టుకొని కాచేదిగదా అనిపించినది. మరొకామె తన కన్న బిడ్డల నిద్దరిని శరణాలయములో దిగవిడిచి తానొక కండెన్సుడు స్కూలులో చదువుకొనుచున్నది. ఆమె శరణాలయములో ఉంచిన బిడ్డలను గురించి సదా వలవలలాడుచుండును. వారికి ఆరోగ్యము సరిలేదనో, తిండి సరిలేదనో, ఏవో ఉత్తరములు వచ్చుచుండును. ఆమె వారిని విడిచి ఉండలేకను, దగ్గిర ఉంచుకొని పోషించుకొనలేకను పడుచున్న బాధ చూచిన నాకెంతో కష్టముగా ఉండును. ఆమె యీ బాధలో మా అమ్మ ఉంటే నాకీ బాధలేక పోవును. ఎంత కష్టపడియైనను ఆ బిడ్డలను తన వద్దనే ఉంచుకొని పోషించెడిది కాని శరణాలయమునకు పంపెడిదా? అది నా దురదృష్టమే అని అంటూ ఉంటే తల్లి ఉన్న ఎన్నివిధాల ఆదుకొనునో మాతృమూర్తిలో ఎంత శక్తి ఉన్నదో అనిపించుచుండును.

నెల దినముల పసి గ్రుడ్డును వదలి ఒక తల్లి మరణించినది ఆ పసిబిడ్డను పెంచవలసిన బాధ్యత వృద్ధురాలైన బామ్మపై పడినది. ఆమెయేగాదు తండ్రి పెద తండ్రులు పినతండ్రులు మేనత్తలు ఆమెను అల్లారుగాముద్దుగా పెంచినారు. సహజ దుర్బలత్వమువల్లను పోతపాలవల్లను ఆ బిడ్డకు యెప్పుడు అనారోగ్యమే. అయినను ఆమెదైవానుగ్రహమువలన పెరిగినది పెద్దదైనది. ఒక పట్టభద్రునకిచ్చి వివాహము చేసినారు. ఆయన గవర్నమెంటు ఉద్యోగి అయినాడు. ఎనిమిది కాన్పులు కనినది. ఆరుగురు బిడ్డలు సుఖముగా ఉన్నారు

ఇద్దరు మగపిల్లలు నాలుగురాడు బిడ్డలు పెద్దవాడు ఉద్యోగము చేయుచున్నాడు. చిన్నవాడు ఇంజనీరు చదువుచున్నాడు. పెద్దకొమార్తె వివాహమైనది. మగపిల్లల ఉపనయనములైనవి. ఇంత పెద్దకుటుంబిని అయినను ఆమెదుర్బలముగానేయుండెడిది. జన్మారంభమున ఉన్న ఉబ్బసము ఆమెను సర్వదాపీడించుచుండెడిది. అయినను ఆ వోపికేమో ఎంతవంటయినను చేసెడిది, ఎన్ని ఎన్ని పిండివంటలైన చేసెడిది. ఎంతదూరమైన నడిచెడిది ఆయాసము లేకున్న

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ

ఆమె యంతపని మంతురాలు లేదు. ఎన్ని కుట్లో కుట్టెడిది ఎన్ని అల్లికలలో అల్లెడిది. ఇంకను ఎన్ని చేతిపనులలో అతి సులభముగా చేసెడిది, ఆమె బిడ్డలందరు పుటక చక్కనివారే ఆ బిడ్డలు తల శేగియు బట్టలుమాసియు యుండగా నేను చూడ లేదు. నెల రోజుల బిడ్డగా ఉండగనే తల్లి పోయినందువల్ల ఆమె మాతృవియోగబాధ యెరుగదు. పెంచిన బామ్మనే 'అమ్మ' అని పిల్చి మాతృలాలసను ఆరూపముగ అనుభవించి నది. ఆ బామ్మయు తన బిడ్డలను విడిచి ఆమెనే మిన్నగా చూచెడిది. నిజముగా బామ్మపోయి నప్పుడె ఆమె మాతృవియోగ దుఃఖమును చవి చూచినది. అయినను అప్పటికే ఆమె ముగ్గురు బిడ్డల తల్లియై యుండుటచేత పెద్దగా విచారించు హేతువు లేక పోయినది. కనిపెంచుచు గృహ కృత్యములు చేసికొనుచున్నను. ఆమె నంటి పెట్టియున్న శ్వాసకావ్యాధి ఆమెను వీడలేదు. ఆమె కాన్పులచే సడలినకొలది, ఆవ్యాధి ప్రకో పింపసాగినది. ఒకానొక కాన్పులో అది టి. బి. అని గూడ చికిత్సచేసినారు. ఈ జబ్బు వచ్చిన తరువాత ఆమె మూడు కాన్పులు కనినది. వంట మనిషి, పనిమనిషి సహాయముతో గృహ కృత్య ములకేలోటు లేకుండ జరిగిపోజొచ్చినది. ఉన్న ట్టుండి గడచిన వేసవిలో ఒకనాడు సాయంత్రము నాల్గుగంటలవేళ డాక్టరమ్మవద్దకుపోయి యింజె క్షను పుచ్చుకొని వచ్చి, టిఫిను తీసుకొని పండు రసముత్రాగి, ఏమియుతోచుటలేదని సినిమాకు బయలుదేరినదట. వంటయినది భోజనము చేసి వెళ్ళమ్మా అని వంటమనిషి అంటే ఇప్పుడే టిఫిన్, పండురసము త్రాగినాను గదా. మరల వచ్చి భోజనము చేయుదునులే అనినదట. ఇంటి వారి అబ్బాయివస్తే అబ్బాయి నీకు గూడా వంటచేయించినాను మాయింటను భోజనము చేయుమని చెప్పి మూడవ కొమార్తెను వెంట నిడుకొని సినిమాకు నడిచియే వెళ్ళినదట. పెద్ద కొమారుడు వెంటవచ్చి టిక్కట్టుకొని యిచ్చి వచ్చినాడట, పిల్లా ఆమే లోపలికిపోయి కూర్చుని ఒక నిముసమైనదో లేదో 'అమ్మాయి నాకేదో వికారముగా నున్నది, బాగా లేదే ఇంటికి పోవు దము' రమ్మని పిల్లను వెంటబెట్టుకొని బయటికి వచ్చి రిక్షామాట్లాడుకొని పిల్లతోబాటు బండి యెక్కినదట. అంతే రెండు వీధులు దాటినారో లేదో ఆమె వమనము చేసికొని పిల్ల ఒడిలోనే వొరిగి పోయినదట, అంతే మరల ప్రాణములేని కళేబరము మాత్రమే యింటికి చేర్చబడినది. ఈ మరణము వూరి వారందరికి ఎంత ఆశ్చర్య మైనదో చెప్పలేను. కట్టిన చీరె నలగలేదు ముఖ మున ఉన్న బొట్టు చెరగలేదు. తలలోని పూవులు వాడలేదు. కొమార్తెను వెంటబెట్టుకొని నడచి వెళ్ళుచుండగా అంతకు ముందుగా నందరు చూచినవారే. మరి ఆశ్చర్యముగాదా ఆమృతి! అంతకు కొలది దినములకు ముందే నాస్థితియే మియు బాగుగాలేదు. అవతారము చాలించే టట్టుగా నున్నది. ఈ పరిస్థితులలో పాపాయి (అమె కడగొట్టుబిడ్డ) నీ వద్ద ఉండుటే బాగుగా నున్నదని మేనత్తకు వ్రాసినదట. ఈ విధముగా భవిష్యత్తు యెరిగినదానివలె అన్నియు చేసి తనువు చాలించినది. తల్లి లేనిబిడ్డ తానొక్కతే అయితే తనబిడ్డ లార్గురుతల్లిలేని వారైనారు. విధిని తప్పించగలవారెవరు? ఇంటి యిల్లాలు లేక పోవుటతో ఆయిల్లు శోభావిహీనమై పోయి నది. గృహిణికి గృహమునకుగల సంబంధము, తల్లికి బిడ్డకు గల సంబంధము వంటిదే. ఇంటికి యిల్లాలు ఉన్న నిండు తనము. బిడ్డకు తల్లియున్న నిండుతనము ఎందరున్నను తీరదు. మగ పిల్లల మాటయెట్లున్నను. ఆడు పిల్లలకా తల్లి కఱవు యావజ్జీవితము వ్యధాకరమె. ఇందులకే తల్లి లేనిబిడ్డ ధరణి కెక్కనము. తల్లి ఉంటేనే పుట్టిల్లు, పాలు ఉంటే పరమాన్నము. కొండంత తండ్రి కంటె ఏకులబుట్టంత తల్లి మేలు అన్న సామెతలు

వెలసినవి. ఈ సామెతలలో ఎంతయో సత్యమున్నది. ఇవి అనుభవముతోగూడిన యథార్థ వాక్యములు గానిరిత్త పదములుగావు. తల్లిలేని బిడ్డయనగనే ప్రతివారు జాలిపడుదురు. ఆదరింతురుకాని ఆకొఱతతీరదు, తల్లిలేని బిడ్డలుగూడ పుట్టింటికి వత్తురు, కాని తృప్తి సంతోషము కనిపించదు, ఎంత పేదరాలైనను తండ్రి కొఱతను తల్లి తీర్చగలదుగాని యెంత ధనధాన్య సంపత్తి గల వాడైనను తల్లికొఱతను తండ్రి తీర్చలేడు, ఆ కొఱత యావజ్జీవ ముండునదేకాని, ఒకనాటతీరునదికాదు ముఖ్యముగా ఆడపిల్లలకు అండయు,ఆదరము సౌఖ్యము సంతోషము అన్నియు తీర్చగలదితల్లి మాత్రమే అందువల్లనే పైసామెతలు వచ్చినవి. ఆమెపిల్లలలో ఇద్దఱు కొమార్తెలు తండ్రి వద్దఉన్నారు. ఆ కడగొట్టు బిడ్డ జనముద్దయిన బిడ్డ. ఆట పాట మాట రూపము అన్ని విధాల ఎంతో ముచ్చటగా ఉండును. ఆ నాలుగేళ్ళ ఆ పాపకు తన తల్లి చనిపోయిన సంగతి తెలియదు. మా అమ్మ ఆసుపత్రికి వెళ్ళినది వచ్చేటప్పుడు బజార్లో బిస్కట్లు, గాజులు అన్ని కొనుక్కొని వస్తుంది. నాకు అప్పచ్చులు పెట్టుతుంది సినిమాకు తీసుకొని పోతుంది అని యేమేమో చెప్పుచుండును. ఎవరైనా తన్నేమైనా చేసిన అమ్మ వచ్చినాక అమ్మతో చెప్పుతానని బెదరించుచుండును. ఆ మాటలు వినుటకెంతో దుర్భరముగా ఉండును. కాని ఆ భావము చెరపుట యెందులకు? ఈ శైశవములోనైన ఆ బాధ తెలియబడకుండ ఉండుటే మేలనిపించుచుండును.

కల్పలతా: స్త్రీయొక్క మాతృస్థానమెంత ఉదాత్తమైనదో, అంత ఉత్కృష్టమైనది. తల్లి తర్వాతనే తండ్రి. అందువల్లనే "మాతృదేవోభవ" అన్న తర్వాతనే "పితృదేవో భవ" అన్నారు పెద్దలు. ఈ మాతృ స్థానముయొక్క విలువబట్టియైనను స్త్రీ తాను స్త్రీయై జన్మించినందులకు గర్వించవచ్చునను కొందును.

మిత్రురాలు శారద

The Handicrafts Insti-
te run under our auspices
Hyderabad has already
ined 175 women in diffe-
nt crafts ; over a hundred
them are now employed
Craft Instructresses in
Welfare Extension Pro-
ts, Block Development
ntres and in the Primary
d Secondary Schools. 8 in
Cardboard and binding,
n the Cane and Bamboo
k, 6 in the Dyeing and
ting, 4 in the Fancy
ther work and 12 in the
t and Wooden Toy
king sections are at
sent under training.







The Sabha is also implementing in Hyderabad a Scheme of Condensed Course of education for adult women with twentyfive students for the H. S. C. examination. A Handloom Training Cum-Production centre is also established with thirty women working on fifteen looms.

# ఆంధ్ర మహిళా సభ

## మైలాపూర్ - మద్రాసు

**మహిళా విద్యాలయము** : హిందీ, కాశీవిశ్వవిద్యాలయపుఅడ్మిషన్, ఆంధ్రామెట్రిక్, ఇ. ఎస్. ఎల్. సి., పరీక్షలకు శిక్షణ.

**పారిశ్రామిక విద్యాలయము** : కుట్టు, ఎంబ్రాయిడరీ, ఊలు అల్లికలు, నూలు వడకుట, చేనేత, అచ్చుకూర్పు, ముద్రణ, బైండింగ్ ఇత్యాది పరిశ్రమలలో గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ, బీద విద్యార్థినులకు ఉచితము.

**మహిళా మందిరము** : విద్యార్థినులకు వసతి గృహము.

**ఆంధ్ర మహిళ** : స్త్రీలలో విద్యా వ్యాప్తికై స్త్రీలచే నడుపబడుచున్న సచిత్ర మాస పత్రిక

**నర్సింగ్ హోమ్** : స్త్రీ శిశు సంరక్షణశాల, ప్రసూతిశాల, ఉచిత వైద్యశాల, కుటుంబ నియంత్రణశాఖ, దంత వైద్యశాల—అడయారులో నిర్మించబడినవి. భారత ప్రభుత్వ ఆరోగ్య శాఖవారి విధానాన్ని అనుసరించి, సంక్షిప్త నర్స్ ఎయిడ్—మంత్రసాని పనులలో శిక్షణ యివ్వబడు చున్నది. ఫామిలీ ప్లానింగు వర్కర్సుకు శిక్షణ కూడ యివ్వబడుచున్నది.

**ఆర్థోపీడిక్ సెంటర్** : వికలాంగులగు బాలబాలికలకు సంరక్షణ, విద్య యిచ్చే సంక్షేమకేంద్రం.

**ముద్రణాలయము** : విద్యార్థినులకు అచ్చుకూర్పు, బైండింగ్, ప్రూపురీడింగు, మొదలైనవి ఉచితంగా నేర్పబడును. ప్రింటింగు జాబ్ వర్కు చేయబడును.

**నాగేశ్వర శిశువిహార్** : పిల్లల విద్యావినోద కేంద్రం ప్రాథమిక పాఠశాల నడుప బడుచున్నది.

**వనితా బాలవిహార్** : స్త్రీలకు, పిల్లలకు, పార్కు, ఆటస్థలం

## ఆంధ్ర మహిళా సభ, హైదరాబాదు

(1) ప్రాంతీయ చేతిపనుల శిక్షణాలయం. (2) సంక్షిప్త విద్యాప్రణాళిక, (3) చేనేత శిక్షణ- ఉత్పత్తి కేంద్రము, (4) బేసిక్ విద్యాశిక్షణాలయం (5) శిశువిహార్ (6) కుటుంబ నియంత్రణ శాఖ. (7) ఆగ్జలరినర్స్ మిడ్‌వైఫ్ ట్రయినింగ్ (8) వసతిగృహము.

Printed and Published by N. R. Chendur at Andhra Mahila Press, 7-A, Rosary Church Road
San Thome, Madras-4. Hony. Editor: Mrs. Malati Chendur